శ్రీమదుమారమణాయనమః.

# నీతివాక్యామృతము.

ఇది,

క్రొత్తపల్లి సూర్యరావుచే

మహాకవి సోమదేవసూరి సంస్కృతవచనమునుండి

తెనుఁగుచేయఁబడినది.



మొదటికూర్పు 700.

కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు

వాకీ చివమూర్యారావుచే సరస్వతీపత్రికాధిపతులకొఱకు

ముద్రించి ప్రకటింపఁబడెను

1911.



వెల 4 అణాలు.

శ్రీమదుమారమణాయనమః.

# నీతివాక్యామృతము.

ఇది,

క్రొత్తపల్లి సూర్యరావుచే

మహాకవి సోమదేవసూరి సంస్కృతరచనమునుండి

తెనుఁగుచేయఁబడినది.

మొదటికూర్పు 700.


కాకినాడ:

శ్రీసరస్వతీముద్రాక్షరశాలయందు

బాకీ పినసూర్యారావుచే సరస్వతీపత్రికాధిపతులకొఱకు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1911.




వెల 4 అణాలు.

శ్రీమన్నారాయణాయనమః

# నీతివాక్యామృతము.

## ధర్మార్థఫలసాధనమైన రాజ్యమునకు నమస్కారము.

## ధర్మసముద్దేశము.

దేనివలన సుఖమును కల్యాణమును గలుగునో యది ధర్మము. దీనికి విపరీతఫల మిచ్చునది యధర్మము. తనకువలెనే పరులకును గుశలవ్యాపారమునందలి తలంపును, శక్తికొలఁది త్యాగమును, దపస్సును, ధర్మము లభించుట కుపాయములు. సర్వసత్త్వ ములయందును సమబుద్ధి యుంచుట యన్నియాచరణములలో శ్రేష్ఠమైనది. భూతద్రోహి కిహపరములందే కార్యమును శ్రేయోదాయకము కాదు. హింసచేయనివాఁడు వ్రతరిక్తుఁ డయినను వానిచరితము స్వర్గసాధనమగును. ఏపని చేసినఁ దనకు దుస్థితి వచ్చునో యది విడిచి పెట్టుటయే దేశత్యాగము చేసినట్టులు. ఎదుటివాని దుస్థితి నెఱింగియుండియు ధ నమును యాచింపనర్థియే శత్రువు. శరీరమును మనస్సును సందేహాతులయ్యు దక్కని వ్రతమేదియో దాని నాచరింపవలయును. ఐహికాముష్మికఫలార్థమై చేయు ధనవ్య యము త్యాగమనఁబడును. అపాత్రున కిచ్చినయర్థము బూదిలో హోమము కావించిన ట్లే. ధర్మపాత్రము, కార్యపాత్రము, కామపాత్రము నని పాత్రములు మూఁడుతె ఱఁగులు. కీర్తిపాత్ర మొక్కటి నిట్లే కొందఱు వక్కాణించుచున్నారు. ఆశ్రితుల ను రక్షింపనిదియు ధర్మాటంకముఁ జేయునదియు నగు కీర్తితో నేమిపని. భాగీరథ- శ్రీ-పార్వతి యనినట్లే పండితుల ప్రసిద్ధికిఁ గారణము వేఱుగాని త్యాగము గాదు. వా రు ప్రతిగ్రహించువారును వ్యాపకులును సనాతనులును గారు. శరణాగతుల కాశాభం గము చేయుధన మెవ్వరియొద్దనుండకుండుఁగాక! అర్థులకుఁ బంచిపెట్టుటయుఁ దాన నుభవించుటయునే యర్థసిద్ధికి ఫలము. కేవలలుబ్ధున కౌచిత్యము లేదు. దానముచే తను ప్రియవచనములచేతను నితరులకు సంతోషము గలిగించుటయే యౌచిత్య మనఁబడు ను. ఏవాఁడు సత్పురుషులకై ధనమును వినియోగించి జన్మాంతరములందుఁ గూడ ధన మును దనతోఁ గొనిపోవుచున్నాఁడో యాతఁడే భంగ్యంతరమున లుబ్ధుఁడు. పెట్టని వాఁడు ప్రియాలాపము లాడుట యర్థి రెండవపోటికిఁ జని గడించుకొనకుండ నాటంక మునకే. ఎల్లప్పుడు దుఃఖించువానికి బంధువెవ్వఁడు? నిత్యమును యాచించువానిం గని

ఱొవ్వఁడు కలఁతపడఁడు? తపస్సనఁగా నింద్రియములను మనస్సును నియమించుటయే. నియమమనఁగా విహితమైనదానిం జేయుటయు నిషేధింపఁబడినదానిం ద్యజించుటయు నే. విధినిషేధములు రెండును నైతిహ్యాయత్తము లయినవి. (ఐతిహ్యమనఁ బారంపర్యముగ వచ్చు నుపదేశము.) అందును స్వప్రమాణబాధయును బూర్వాపరవిరోధమును లేని యైతిహ్యమునందు సజ్జనులు శ్రద్ధకలిగియుండు టొప్పు. అనియమితేంద్రియమనోవృత్తిగలవాఁడై యొనర్చునాతని సర్వానుష్ఠానములును గజస్నానముపంటివి. తా నాచరింపనివానిజ్ఞానము అసహ్యించుకొనఁబడువాని కార్యములువలెనే కేవల శరీరాయాసకారణమే. లోకము కథోపజీవివలెఁ బరులకు ధర్మోపదేశము చేయుట సులభము. దినదినమును నియమముగాఁ గొంచెమైనను దానముచేయువానికిని దపస్సుచేయువానికిని దివ్యమైన పరలోకములు లభించును. పరమాణువులనయినఁ బోగుచేయ మొదలిడినచోఁ గాలక్రమమున మేరువంతయగును. ధర్మము, శ్రుతము, ధనము వీనిని బ్రతిదినమును సంగ్రహించినచో సముద్రముకంటె నధికమగును. ధర్మమునెడల సజాగ్రత్తగా నుండుటకంటె నాత్మవంచనము మఱియొకటి లేదు. ఒక్కసారిగాఁ బుణ్యరాశి నెవ్వఁడు గడించినాఁడు? స్వయముగా నాచరింపనివాని మనోరథములు స్వప్నములో దొరికిన రాజ్యముతో సమానములు. ఔషధమువలె నాత్మహితమైన ధర్మమును బరులవిరోధమున బుద్ధిమంతుఁ డనుష్ఠింపకుండును. ధర్మానుష్ఠానమునందుఁ బ్రార్థింపకుండఁగనే లోకవ్యవహారక్రమము ననుసరించుచున్నది అధర్మకర్మలు చేయువాని కెవ్వరైన గురువులు గాని పురశ్చారులు గాని కలరా? కుశలబుద్ధిగలవారు కంఠగతప్రాణులైనపుడు నశుభకార్యము నాచరింపరు. తమవ్యసనంబును దీర్చుకొనుటకై ధూర్తులబోధలచే శ్రీమంతులు దురీహితవృత్తు లగుచున్నారు. దుష్టుల సంపర్క మేమి చేయులేదు? అగ్నివలె దుర్జనుఁడు తానాశ్రయించినవానినే తగులఁబెట్టును. తాత్కాలికస్వల్పసుఖమునకయి యడవిమేసుఁగువలె నాపదలపాలుగానివాఁ డెవ్వఁడు? ధర్మాతిక్రమణముచే ధనము పరులకుఁ జెందుచున్నది, మఱియుఁ గరిం జంపిన సింహమువలెఁ బాపము సంభవించుచున్నది. (సింహ మేనుఁగుం జంపినపుడు దానితలలోని ముత్యము లితరులకుఁ జెందుచున్నవి.) తనకు సరిపడిన ధాన్యముం దాఁచుకొనిన సంసారికి వలెనే యధార్మికున కుత్తరకాలఫలము లేదు. అర్థకామములు రెంటిని వీడిచి యెవఁడు ధర్మమునే యుపాసించుచున్నాఁడో వాఁడు పండినచేనును విడిచి చాటిసేల దున్నునట్టి వానికి సమానుఁడు. ఆముత్రికసుఖవిరోధము కాకుండునట్లు సుఖము లనుభవించువాఁడే సుఖియగును. అన్యాయసుఖలవమువలన నరుఁడు రెండులోకములయందును పేరవిరాజినదుఃఖమనుభవించు

టమాడ మిగులఁ జిత్రముగా నున్నది. ప్రాణుల కీజన్మమునందలి సుఖదుఃఖములచేఁగలుగునుత్కర్షాపకర్షలు వారిధర్మాధర్మములం దెలిసికొనుటకు సాధనము లగుచున్నవి. అదృష్టాధిదేవతయొక్క యధికారము లేనిచోట నొక్కవస్తువును గలుగదు.

## 2. అర్థసముద్దేశము.

దేనివలన సర్వప్రయోజనములు సిద్ధించునో యది యర్థమనఁబడును. అర్థానుబంధముగా నెవ్వఁడనుభవించునో వాఁడె యాయర్థమునకుఁ బాత్రుఁడు. అలబ్ధలాభము, లబ్ధపరిరక్షణము, రక్షితవివర్ధనమునని యర్థానుబంధము మూఁడువిధములు. ఫలసాధనమున కర్థానుబంధమని పేరు. తీర్థులను ధనముచే సంభావింపకున్నచోఁ దేనెటీఁగవలె నన్ని విధములం జెడును. ధర్మసంబంధులు (లౌకిక) కార్యసంబంధులును దీర్థులని పిలువంబడుదురు. తాదాత్విక, మూలహర, కదర్యుల విషయమై ప్రత్యవాయము సులభము కాదు. గడింపకుండలభించిన ధనమును దుర్వ్యయము చేయువారు తాదాత్వికులు. తాతతండ్రులనుండి వచ్చు ద్రవ్యము నన్యాయ్యముగా ననుభవించువారు మూలహరులు. సేవకులను బీడించియుఁ దాము పీడింపఁబడియు ధనార్జనము చేయువారు కదర్యులు. తాదాత్వికమూలహరులయుత్తరకాలఫలమునందు శుభము కలుగదు. కదర్యునిగడించిన యర్థము రాజులు జ్ఞాతులు చోరులుఁ గానివారికి నిధియగును.

## 3. కామసముద్దేశము.

తనకభిమానజనకమైనమేరనమునందు సర్వేంద్రియంబులును బ్రీతిగలిగియుండునో యది కామము. ధర్మమునకు నర్థమునకు బాధకలుగనిరీతిని గామము ననుభవింపవలెను. అసుఖకరము కాఁగూడదు. త్రివర్గమును (ధర్మకామార్థములను) సమానముగా సేవించుట యుక్తము. ఒక్కదానినే యత్యాసక్తితో సేవించువాఁడు తక్కినరెంటిని దన్నుఁబరులను బీడపెట్టువాఁడై యగును. తనసుఖమును గట్టిపెట్టుకొని ధనార్జనము చేయుట యితరులకొఱకు బరువు మోయుట వంటిది. ఇంద్రియములు మనస్సును సంతసించునట్టి ఫలము నిచ్చునవియే సంపత్తులు. జితేంద్రియుఁడు కానివాని కొక్కకార్యమును సిద్ధింపదు. ఇష్టమైనదానియం దాసక్తియుఁ దద్విరుద్ధవస్తువునం దనాసక్తియు నింద్రియజయమనఁబడును. అర్థశాస్త్రాధ్యయనము కారణముగా దేనిచేతనర్థసంబంధజ్ఞానము కలుగునో యదియు నింద్రియజయమనఁదగును. ఒడలు లేని మన్మథుని జయింపఁజాలనివాఁడు పుష్టిగల శరీరధారులగు నరాదులను జయింపఁగలఁడా? కామాసక్తునకు మందులేదు. అత్యంతవనితాసక్తునకు ధనము, ధర్మము, శరీరమును లేవు. శాస్త్రవిరుద్ధ

కామోపభోగాసక్తుఁడు కలిగినవాఁడైనను చిరకాలము సుఖపడఁ జాలఁడు. ధర్మార్థకామములు మూఁడును నొక్కసారి ప్రాప్తించినపుడు పూర్వపూర్వము బలీయము. ధర్మకామము లర్థమూలము లగుటచేఁ గాలాంతరమున కర్థమే ముఖ్యమైనది.

## 4. అరిషడ్వర్గసముద్దేశము.

అయుక్తిక ప్రణీతములైన కామ, క్రోధ, లోభ, మద, మాన, హర్షములు రాజుల కాంతరంగిక షడ్వర్గము. పరగృహీతలైన కన్యలయందుఁ గాని స్త్రీలయందుఁ గాని దురుద్దేశము కలుగుట కామము. విచారింపకుండఁ బరునకుఁ గాని దనకుఁ గాని పాపహేతు వగుట క్రోధము. దానవిషయమున స్వధనమీకుండుటయు, నకారణముగఁ బరవిత్త గ్రహణమును లోభము. తనకులబలైశ్వర్యరూపవిద్యాదులచే నహంకారము గాని పర తిరస్కారము గాని మద మనఁబడును. దురభినివేశము గాని మోక్షోపయుక్తవాక్య నిరాకరణము గాని మానమనఁదగును. నిర్నిమిత్తముగ నితరులకు దుఃఖము కలిగించుటచే గాని తనకు ధనాదివృద్ధిచేఁ గాని కలిగిన యాత్మరంజనమే హర్షము.

## 5. విద్యావృద్ధసముద్దేశము.

అనుకూలురకింద్రునివలెఁ బ్రతికూలురకు యమునివలె నుండువాఁడె రాజు. దుష్టనిగ్రహము శిష్టపరిపాలనమును రాజధర్మములు గాని శిరోముండన జటాధారణములు కావు. భూమిఁ బాలింప నుచితమైన రాజకర్మకు రాజ్యమని పేరు. వర్ణాశ్రమవంతమై, ధాన్యము, బంగరు, పశువులు, లోహాదులతోఁ గూడినది భూమి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు నాల్గువర్ణములు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యతియనునవి యాశ్రమములు. వేదముఁ జదివి స్నాతకము (స్నానము) చేసికొనునట్టియతఁ డుపకుర్వాణుఁడు. స్నానమనునది వివాహదీక్షావిశేషము. గురువునొద్ద వేదముం జదువుకొని ధనాదికమునం గురువుం బూజించి యాతని యనుజ్ఞపై గృహస్థాశ్రమమును స్వీకరించువాఁడు పకుర్వాణకబ్రహ్మచారి. ప్రాణాంతకమందును దారపరిగ్రహము చేయనివాఁడు నైష్ఠిక బ్రహ్మచారి. జన్మించి వంశమును బవిత్రము చేయువాఁడు పుత్రుఁడు. అపుత్రకుఁడగు నరుఁడు పితరుల ఋణమున, వేదముంజదువని యాతఁడు బ్రహ్మర్షుల ఋణమున, యజనాదులు చేయని యతఁడు దేవతలఋణమునఁ, జచ్చియు జనులచే నక్కటా! యనిపించుకొనని వాఁడు జనులఋణమునం బడియుండును. తానే పుత్రుఁడు. ఈయాత్మయే యాత్మచేఁ దన్నాత్మయందు ధరించిన నైష్ఠికునకుఁ బూతిని బొందించును. నిత్యనైమిత్తికానుష్ఠానరతుఁడు గృహస్థుఁడు. బ్రహ్మయజ్ఞ, అమరయజ్ఞ, పితృయజ్ఞ, అతిథియ

జ్ఞ భూతయజ్ఞములే నిత్యానుష్ఠానములు. దర్శపూర్ణమాసాదులందుఁ జేయునది నైమిత్తి
కానుష్ఠానము. గ్రామములు నాహారము సంసారవ్యవహారములును విడిచిపెట్టి సభార్యుఁ
డైకాని యొక్కఁడే గాని యథావిధిగా వనమునందు వసించు వాఁడు వానప్రస్థుఁడు.
విద్యయను నోడఁగొని తృష్ణాసాగరమును దాఁటఁదలఁచువాఁడు యతి. క్రమవిక్రమము
లు రెండును రాజ్యమూలము. ఆచారము కలిమియే క్రమసంపత్తిం బుట్టించును. ఉద్ధతిలేక
యుండుటయే విక్రమమున కలంకారము. క్రమవిక్రమములకంటె నితరమును బరిగ్రహిం
చినచో రాజ్యమునకు దుష్కరపరిణామమగును. బుద్ధిమంతుఁడే క్రమవిక్రమములు [illegible]
చుటకు నెలవు. విద్యావినీతమతియే బుద్ధిమంతుఁడు. సింహమువలెఁ గేవలపౌరుషము న
వలంబించినవానికిఁ గుశలము చిరకాలముండదు. శాస్త్రము చదువనివాఁడు ప్రజ్ఞావంతుఁ
డయినను శస్త్రముధరింపని శూరునివలె నందఱికిఁ గనఁబడును. ఆలోచించిన నగపడు వ
స్తువులను గాంచుటకుఁ బురుషులకు శాస్త్రము మూఁడవకన్ను. శాస్త్రము చదువనివాఁడు
కన్నులుండియు నంధునివంటియతండె. అజ్ఞానికంటెఁ బశువు వేఱొండులేదు. మూర్ఖ
ప్రభువుం బొందియుండుటకంటె భూమి యరాజకమైయుండుటమేలు. సావందీర్వనిర
ర్ణముమబలె సుజాతుఁ డగునంతనె శాస్త్రాది సంస్కారములేని రాకొమరుని సాధుజనులు
నాయకునిఁగా సమ్మతింపరు. దుర్వినీతుఁడగు నేలికమమించి ప్రజావినాశకారియగు ను
త్పాతము మఱియొక్కటిలేదు. యుక్తాయుక్తములు, యోగవియోగములుఁ దెలియని
వాఁడె దుర్వినీతుఁడు. ఎందు సజ్జనశిక్షచే సద్గుణములు చేరియుండునో యదియే ద్రవ్య
ము (వస్తువు). ద్రవ్యమే క్రియలనుగావించును. అద్రవ్యముకాదు. ద్రవ్యాద్రవ్యప్రకృతి
పురుషుఁడు సంకీర్ణగజముంబోలును. శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణ, విజ్ఞాన
ము, ఊహ, అపోహ, తత్త్వాభినివేశము విద్యయనునవి బుద్ధిగుణములు. వినుటయందిచ్ఛ
శుశ్రూషయనంబడు. శ్రవణమనవినుట. శాస్త్రార్థములను గ్రహించుట గ్రహణము. కా
లాంతరమందును మఱపుఁజెందకుండుటకు ధారణమనిపేరు. మోహసందేహ విపర్యాస
ములం దగులుకొనని జ్ఞానము విజ్ఞానమనఁబరఁగు. తెలియఁబడినదాని నవలంబించి యిత
రవిషయముల విధివితర్కము నూహయందురు. విరుద్ధార్థప్రత్యవాయములనుండి, ఉక్తి
చేతను యుక్తిచేతను మరలుట యపోహ. కాకున్న సామాన్యజ్ఞానము నూహయనియు
విశేషజ్ఞానము నపోహయనియుం జెప్పవచ్చును. విజ్ఞానోహాపోహానుగమ విశుద్ధమైనయి
దమిత్థమనునిశ్చయమునకుఁ దత్త్వాభినివేశమని నామము. ఏదివరుని తెన్నుగఁబొంది హిత
ముంగూర్చి యహితముం గొలంచునో యది విద్య.

ఆన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి యనునాల్గును రాజవిద్యలు. ఆన్వీక్షకిం బ

దివినవాఁడు కార్యాకార్యముల బలాబలంబుల నహేతుకముగ విచారించును. వ్యసనము లప్పుడు శోకింపఁడు. ఐశ్వర్యములబ్బినపుడు వికారము నొందఁడు. ప్రజ్ఞావంతుఁడు దానివలన మిక్కిలి విశారదుఁడగును. త్రయిం దెలిసిన యతఁడు వర్ణాశ్రమాచారములయందతి ప్రగల్భుఁడగును. ధర్మాధర్మములస్థితిని సమస్తముం దెలియును. వార్తను యుక్తియుక్తముగఁ బ్రయోగించినరాజు జీవలోకము నశేషమును సంతోషపెట్టును. తాను సర్వకామములను బొందును. అపరాధులయెడ యమునివలె దండమును నరపాలుఁడు [illegible]నా ప్రజలు స్వమర్యాద నతిక్రమింపరు. ధర్మార్థకామములను త్రివర్గఫలములనిచ్చునవియే విభూతులు. సాంఖ్యము, యోగము, లోకాయతము (చార్వాక) ఆన్వీక్షికి యనంబడును. బౌద్ధ జైనశాస్త్రములు వేదవిరుద్ధములగుట నివి యిందుఁ జేరవు. (లోకాయతము వేదవిరుద్ధమైనదే యైనను శరీరపోషణాదులలో దానికుపకారియగుటచేఁ జేర్పఁబడినది) ప్రకృతిపురుషులం దెలిసినరాజు సత్త్వావలంబకుఁడగును. రజోగుణమువలని ఫలాఫలములను విడుచును తమస్సుచే నభిభవింపఁబడఁడు విద్యావృద్ధులసంసేవకై యుత్సహించును. విద్యావృద్ధసేవయెఱుంగని పాలకుఁడు నిరంకుశంబగు వనగజమువలె సద్యోవినాశముం బొందును ఆన్వీక్షికిం జదువకపోయినను బెద్దలసాంగత్యమున్నచో జలసమీపమునందలి వృక్షచ్ఛాయవలె(జలాశ్రయముకతన) మిగుల శీతలుఁడును వ్యుత్పన్నుఁడునగును. వంశము, వృత్తము, విద్య, అభిజనము, వీనియందు విశుద్ధుఁడు రాజునకుపాధ్యాయుఁడు గాఁదగును. శిష్టజనులయెడ నమ్రుఁడై రాజహితపరముల మహోజ్జ్వలుఁడగును. నృపాలుఁడే పరమదైవతము, (ఏమన) ఈతఁడెవ్వరికిని మ్రొక్కఁడు (కావున). మ్రొక్కువా గురువులకే. పండితసేవలేని విద్యకంటె నజ్ఞానము మేలు. విషముతోఁ గూడిన యమృతమును విడువఁదగును. (విద్య యమృతమువంటిదైనను శిష్టజనసేవలేనిది విషతుల్యమనుట) తెలివిగా శిష్యులు గురుజనుల యాచారముల ననుసరింతురు. క్రొత్త పాత్రమున కంటుకొన్న సంస్కారము బ్రహ్మయైనఁ దుడిచివేయఁజాలఁడు. అంధునివంటి యప్రాజ్ఞుఁడగు పుడమిఱేఁడు మేలుగాని జ్ఞానలవదుర్విదగ్ధుఁడుండరాదు. నల్లని యొఱ్ఱని వస్త్రమునందువలె దుర్విదగ్ధుఁడగు రాజునం దెవ్వనికనురాగముండును? నృపుఁడు గుణగ్రాహియైనచోఁ బండితులకు యథార్థవాదిత్వము శ్రేయస్కరము. తన స్వామికి హితోపదేశములు చేయుటకంటెఁ దాను జచ్చుట మేలు.

## 6. ఆన్వీక్షికీసముద్దేశము.

ఆత్మ, మనస్సు, మరుత్తు, ప్రాణము వీనికిఁ దుల్యమైన సంయోజనయే లక్షణముగాఁ గలది అధ్యాత్మయోగము. అధ్యాత్మజ్ఞుఁడగు నరపాలుఁడు సహజ (భీరుత్వాదులు)

శారీర(వ్యాధియున్నగునవి) మానస (చింతాదులు) ఆగంతు (శత్రుకృతాపకారములు) దోషములచే బాధింపఁబడఁడు. మనసు, ఇంద్రియములు, విషయములు భోగించు నిలయమే యాత్మారాముఁడు. "నేను" అను ప్రత్యయమున కెచ్చట నుపచారము కలుగుచున్నదో యది యాత్మ. ఆత్మలేదను పక్షము స్వీకరించు విద్వాంసుల సర్వానుష్ఠానములు (పరలోకమునకై చేయునవి) విఫలములు. దేనివలన స్మృత్యవమర్శనము, ఊహాపోహనము, శిక్షాలాపగ్రహణముం గలుగుచున్నవో యది మనస్సు. ఆత్మకు విషయానుభవ ద్వారము లింద్రియములు. శబ్దస్పర్శరూపరసగంధములు విషయములు. సమాధీంద్రియములద్వారా దూరార్థములయు సమీపార్థములయు నవబోధనమునకు జ్ఞానమని పేరు. ప్రీతియే సుఖము, మనోనిర్వృతి లేనిసుఖము సుఖమే కాదు.

అభ్యాసము, అభిమానము, సంప్రత్యయవిషయములు సుఖమునకుఁ గారణములు. క్రియాతిశయ పరిపాకహేతు వభ్యాసము. అనునయ సత్కారాదిలాభములచేత నాత్మకుత్కర్ష సంభావనమే యభిమానము. అతద్గుణవస్తువులందుఁ దద్గుణత్వాభినివేశమునకు సంప్రయత్నమని పేరు. ఇంద్రియమనస్సులనుఁ దృప్తిపఱచు భావమునకు విషయమనినామము. అప్రీతియేదుఃఖము. మనస్సును గ్లేశపఱపని దుఃఖము దుఃఖమేకాదు. దుఃఖము సహజము, దోషజము, ఆగంతుకము, అంతరంగజమునని నాల్గుతెఱఁగులు. ఆఁకలివలన దప్పికతన మన్మథవశంవదుఁడగుటను గలిగినదుఃఖము సహజము. తిరస్కారమున నవమానమున నిచ్ఛావిఘాతమువలనఁ గలిగినది యంతరంగజము. క్లేశాయాసములకు విక్లబముంజెందు ప్రకృతిగల మనుజున కైహికాముత్రిక ఫలములు రెండునులేవు. ధమస్సువలెనే మహాయోగమునప్పుడును బలాధిక్యముం జూపలేనివాఁడు కింపురుషుఁడు. వాంఛయున ముందు కాఁబోవుపనులయందలి యభిలాషము. తన ప్రత్యవాయముల నితరులపైకి మరలించు నూహ ద్వేషము. అభిలాష యుడుగుటకును హితాహితప్రాప్తి పరిహారమునకు నుత్సాహమని పేరు. ప్రకర్షయత్నముతోఁ గూడినదగుట సాతిశయలాభముంజేయునది సంస్కారము. అప్పుడు పుట్టినపిల్లలు స్తన్యపానమునకు యత్నించుట యనేక కర్మాభ్యాసవాసనావశమునఁ గాన నదియు సంస్కారమే. శరీరము భోగాయతనము. ఐహికవ్యవహార ప్రసాధనపరమగునది లోకాయతము. లోకాయతమతము నెఱిఁగినరాజే రాష్ట్రకంటకుల నున్మూలించుటకు యత్నించును. యతుల కేకాంతము కంటె ననవద్యమగునది లేదు. కేవల దయాళువు కరతలగతమగు నర్థమును రక్షించుకొనఁ జాలఁడు. ప్రశాంతచిత్తు నెవ్వరు పరిభవింపలేరు. అపరాధము చేసినవారిపై క్షాంతివహించుట యతులకు భూషణముగాని భూపాలురకుఁ గాదు. ఎవ్వనికోపప్రసాదము లా

తని శక్త్యనుసారముగ నుండనో యట్టిపురుషుఁడు వ్యర్థుఁడు. విరోధులపై విక్రమింపని వాఁడు బ్రతికియుండియు మృతుఁడు. భస్మమునఁగాని యగ్నిలోఁగాని నిశ్శంకముగా నెవ్వఁడు కాలూనఁడు? మేటిధర్మమున కనుబంధము కాని పాపము పాపమే కాదు. మ తి యొుపు తెలఁగైన రాజ్యము రెండవనరకమే. ఖలమైత్రి విపదంతముగలది. బంధ ముకంటె మించినశిక్షలేదు. స్త్రీలను విశ్వసించిన మరణాంతము.

## 7. త్రయీసముద్దేశము.

వేదములు నాలుగును, శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛందము, జ్యోతిషము, నిరు క్తము ననుషడంగములును, ఇతిహాస, పురాణ, న్యాయ, మీమాంసలు ను బదునాల్గు ను విద్యాస్థానములు. త్రయివలన వర్ణాశ్రమాచారముల ధర్మాధర్మవ్యవస్థ తెలియును. స్వశక్త్యనురాగప్రవృత్తులందఱును లోకవ్యవహారములయం దధికారులగుదురు ధర్మశాస్త్ర ములుస్మృతులు నివి వేదార్థసంగ్రహములగుటచే వేదములే. అధ్యయనము, యజన ము బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు సమానధర్మములు. ఈమూఁడు వర్ణములవారికి నుపన యనసంస్కారముండుటచే ద్విజాతులని పేరు. వేదము చెప్పుట యజ్ఞములు చేయించు ట, దానముఁ గ్రహించుట బ్రాహ్మణులకు, భూతసంరక్షణము, శస్త్రోపజీవనము సత్పు రుషోపకృతి, దీనోద్ధరణము, రణమునఁ బాఱిపోవమి, యనునవి క్షత్రియునకు, వాణిజ్య ము వైశ్యులకు, శిల్పము, నాట్యము, బండితోలుట శూద్రులకు ధర్మములు. స్త్రీలకొ క్కమాఱు పెండ్లిచేయు నాచారము గలశూద్రులు సచ్ఛూద్రులు. ఆచారానవద్యత్వ ము శుచి, సంభారములు, శరీరశుద్ధి యివి కలశూద్రులను గూడ దేవద్విజతపస్వి పరిచర్య యందు యోగ్యులనుగాఁ జేయును. దయాళుత్వము, సత్యభాషిత్వము, పరధనవిముఖత యిచ్ఛానియమము, స్వజాతిస్త్రీలతో వివాహము, నిషిద్ధస్త్రీయెడల బ్రహ్మచర్యము ని వి సర్వవర్ణములవారికిని సమానధర్మములు. సూర్యదర్శనమువలె ధర్మ మన్నిజాతుల వారికిని సాధారణమే. విశేషానుష్ఠానమున నియమము. నిజశాస్త్రోక్తప్రకారమనుష్ఠించు టయే యెల్లయతులకు స్వధర్మము. ధర్మవిరుద్ధము జరిగినప్పుడు యతులకు స్వశాస్త్రాను సరణమే ప్రాయశ్చిత్తము. (కాని రాజదండనము లేదు.) ఎవ్వని కేదైవమునందు శ్రద్ధకలదో యతఁడా దేవుని బ్రతిష్ఠింపవలయును. భక్తిలేనివాని పూజాదికము సద్య శ్శాపకారణమగును. వర్ణాశ్రమాచారచ్యుతి యొదవినప్పుడు వేదోక్తప్రకారముగ శుద్ధి కావలయును. స్వస్వధర్మములందు సంకరము లేక యుండెనా యది ప్రజను రాజు ను ధర్మార్థకామముల నొందించును. ప్రజను గావనియాతఁ డెట్టిరాజు? స్వధర్మ మునతిక్రమించు నెల్లరకును రాజే (శిక్షించుటకుఁ గాని, యుపదేశమునకుఁ గాని నియమిం

చుటను(గాని) గురువు. తెన్నగాఁ బాలించు ప్రభువులే సమస్తధర్మములలో నాఱవపా
లు నందుదురు. దీనింగూర్చి వైవస్వతమనువు "ఉంఛవృత్తి చేత తెచ్చికొనిన గింజలలోఁ
గూడ షష్ఠాంశప్రదానముచే వనస్థులగు తపస్వులు రాజును సంభావించుచున్నారు. అ
ట్టితపస్వులను రక్షించినరాజునకు వారు కావించు తపస్సునందలి యాఱవపాలు చేరును"
అని చెప్పెను. ఆత్మయందు భక్తి కలిగినయెడల నది యమంగళము కాదు. అగ్నిని పడి
చి, యగ్నిని బరిగ్రహించినవారిని స్పృశింపకుండ ధ్యానము చేయవలయును. స్నానము
చేసి దేవోపాసనము చేయకుండ రెండవదానిం దాఁకఁగూడదు. దేవాలయములోనికేగి
యక్కడిపూజరులను దనసంబంధులైన వృద్ధులను గౌరవింపవలయును. దైవాకారముం
బొందిన (పూజ్యమైన) ఱాయియైన నవమానింపఁబడుటలేదు. అట్టిచోఁ బూజ్యులగు
మనుష్యులయెడఁ జెప్పవలయునా. రాజశాసనమునకు వ్యత్యయముఁ దుష్టలెనే చిహ్న
విచారముండదు. తెలకపిండి నల్లనిదైనను దానిందినుటవలన నావులపాలు తెల్లగానుం
డుటయేకాదు పాలెక్కువయగును అట్లే రాజశాసనము రాజసతావసాదులచే స్వతి
ష్సిద్ధముగా మలినమయినదయినను ధర్మమర్యాదాస్థాపనరూపమగు శుద్ధకార్యముం జే
యును. పరమతాచారములవలన స్వమతాచారములభింపదు, మనశ్శుద్ధియునుగాదు.
శౌచము, దయ, దాక్షిణ్యము యజనాధ్యాపనాదిప్రకృతియుఁ దఱచుగ బ్రాహ్మణుల
కును, బలాత్కారస్వభావము క్షత్రియులకును, కపటగుణము వణిజులకును, బుజావక్రి
శీలత శూద్రులకు సహజగుణములు. బ్రాహ్మణునికోపము దానముతోఁ దీఱును. గురు
లఘులకు నమస్కారావసానముగలది; క్షత్రియునకుఁ బొడమిన క్రోధము ప్రాణాం
తముదనుక నుండును. వాణిజ్యము చేయువారికోపము (కేవలవైశ్యులకుఁగాదు) ప్రి
యాలాపములచే వశించును. జాతిచే వైశ్యులకుఁ బొడమిన కినుక పుచ్చుకొనిన మూల
వృద్ధులిచ్చివేసిన వడఁగును. ఇండ్లు భూములుగలవారితోడను, పరిచితులతోడను వ్యవ
హారము వణిజులకు నిధివంటిది. నీచులను వశముచేసికొనుటకు దండమును భయము చూ
పుటయు నుపాయములు.

## 8. వార్తాసముద్దేశము.

కృషి, పశుపాలనము, వాణిజ్యమునను ప్రజల జీవనసాధనములే వార్తయనఁబడు
ను. ఈవార్తాసమృద్ధియే రాజులకు సర్వసమృద్ధియును. ఎవనికిఁ గృషియుఁ, బశుగణ
మును, గూరనారలుపండుకోఁటలు, నింటియావరణలో మంచినీళ్ళనూయియును గలిగి
యుండునో వానిదే సంసారములో సుఖము. రాజునకుఁ గార్యాలోచనాదులలో బహు
సేవకులను బెట్టుకొనుట సంతోషముఁ గలిగించును. దానివలన ధనవ్యయమగును. అ

యినను వారికానందమే జనించును. కావున నవశ్యకార్యమునకుఁ దక్కఁ దైశ్వర్యసం
గ్రహముచేయవలయుఁ గాని వ్యయమెక్కుడగురీతిని సేవకులం జేర్పరాదు. ప్రతిదిన
మును గొంచెముగా బంగారుతీయుచుంటిమా మేరుపర్వతమైన నశించును. అట్టిచో
రాజకోశము లెక్కయేమి? విశేషవ్యయము చేయు రాజుగలదేశమున నెల్లపుడును గఱవు
పట్టును. (వ్యయమునకై జనులవలనఁ బన్నులు గ్రహించుచుండును గాన దుర్భిక్షముపట్టు
ననుట) సముద్రమునకు దాహమెత్తిన నీ రెక్కడదొరకును! తనకు జీవనప్రాయమైనధ
నము లేనియపుడు రాజునకు గొప్పహానియు మనస్తాపమును బుట్టును. జనులయాఁకలిద
ప్పులను దీర్పలేనికతన వారార్తులయి పాపము సంభవించును వృద్ధులను, బాలురను,
వ్యాధిగ్రస్తులను, నీరసులను, బసులను బంధువులనువలెఁ బోషింపవలయును. ఎక్కుడు
బరువు మోయించుటయు మిగులదూరము నడపించుటయును బశువులకకాలమరణము
నకుఁ గారణములు. సుంకము వృద్ధిచేయుటయు, బలాత్కారముగఁ బన్నులు పుచ్చు
కొనుటయు, నితరదేశవస్తువులు మనదేశమునకు రాకుండఁజేసికొనుటకు హేతువులు.
ధాన్యాదులు కొలుచుటకుఁ గట్టితోఁజేసినపాత్రి లుపయోగింపవలయును. తక్కెడలు
తూనికరాళ్లును రాజు నడుమనడుమ పరిశోధించుచుండవలయును. దానివలన వ్యవహార
దూషణముడుఁగును. వర్తకులేర్పఱచెడు వెలల హెచ్చువలన నక్కడివారికిని బైనుండి వ
చ్చువారికిని బాధకలుగును. దేశమునుబట్టి కాలమునుబట్టి సామగ్రినిబట్టి దరలు తగ్గుచు
హెచ్చుచుండును. అంగడులయందలి తక్కెడలుఁ, గొలపాత్రలు ననియమము చేయు
టను రాజుస్వయముగా జాగ్రత్తపడవలయును. వర్తకులకంటె పశ్యతోహరులు (చూ
చుచుండఁగనే దొంగిలించుదొంగలు) వేఱుగలేరు. వర్తకు లితరులపైఁగ్రోధమున వెల
యెక్కువచేసి విక్రయించినవస్తువులయెక్కుడువెల రాజునకుఁ బోవును. నిజమయినమూ
ల్యమే యమ్మినవానిదగును. సొమ్ముకొంచెమిచ్చి కపటమున నెక్కుడు వస్తువు లెవ్వఁడై
నఁ దీసికొనెనా యదియన్యాయోపార్జిత మగుటచే రాజునకే చెందును. ఒకయన్యా
యము నుపేక్షించినయెడల సర్వమును నశించును గావునరాజులు న్యాయదృష్టికలవారు
గాఁ దగును. చోరులు, చరటులు, (గూఢచారులు) చారణులు, రాజునకుఁ బ్రియులు,
హిరణ్యపాలకులు, తలారులు, కిరాతులు, వాదమాడువారు, నియోగులు, గ్రామకరణము
లు, అప్పులిచ్చువారు, (పెట్టుఁబడి పెట్టినవారు) వను పదునొకండుగురు రాష్ట్రకంటకులు.
అధికారిపరితాపవంతుఁడై కంటకశోధనము చేయువాఁడైనచోఁ బైవారు నశింతురు. వీ
రిలో నప్పులిచ్చువారు విశేషించి యుపద్రవకారులు. అన్యాయముగా ధాన్యాదు లె
క్కుడుగాఁ బుచ్చుకొని రాజతంత్రములను ధనమును బుచ్చుకొని దేశమును నశింపఁజే

యుచున్నారు. వారికిఁ గార్యాకార్యములయెడల దాక్షిణ్యము (సరళత్వము) లేదు. కావున వారిని రాజు నిగ్రహింపవలయును. రోగమువచ్చినప్పుడు మందివ్వవలెను పాముకఱచిన తన వ్రేలినుగూడఁ (ఇతరావయవములమేలుకొఱకు) గోసికొనవలయును

## 9 దండనీతిసముద్దేశము.

వ్యాధిఁగనిపెట్టి శరీరము నిర్దోషము చేయుటకు వైద్యశాస్త్రమువలెనే నరులను నిర్దోషులను జేయుటకు హేతువైనది దండము. దోషముఁ గ్రమింపకుండ దండముం బ్రయోగించుటయే దండనీతి. ప్రభువు దండమును బ్రజలమేలుకొరకు ప్రయోగించును గాని ధనాదులకై కాదు. తనపొట్టకై ప్రజలయందు దోషములు వెదకు రాజైనను వైద్యుఁడైనను నెట్టివారు? (కుత్సితులనుట.) దండించి గణించినది, జూదమువలనలభించినది, యుద్ధమున మృతినొందిన వారి యొద్దనుండి దొరకినది, దారిలోన నరులయొద్దను సంగడిలో నితరులు మఱచిపోయినది, దొంగయొద్దను గ్రహించినది, సుతులుపతులు మున్నగువారు లేనియువిధవల నుండియు, గన్యలనుండియు గ్రహించినది, రాజ స్వోపయోగమునకుఁ బెట్టుకొనరాదు. అన్యాయముగా విధించినదండము కామక్రోధములవలనఁ గాని యజ్ఞానమునఁ గాని జనద్వేషమును బుట్టించును. దండము విధింపకున్నచో జనులయందు మాత్స్యన్యాయము ద్భవించును బలవంతములగు మత్స్యములు దుర్బలములగువానిని మ్రింగివేయుట మాత్స్యన్యాయము.

## 10. మంత్రిసముద్దేశము.

మంత్రిపురోహిత సేనాపతులచే, దేశకాలముల యుపరోధముంబట్టి తగినటులఁ జెప్పఁబడినట్లునడచు రాజు రిపులచేఁ గూడఁ నహార్యబుద్ధియగును. పరిమళములేని దారము కూడఁ బుష్పముల సహవాసముచే నలభ్యమగు దేవతాశిరస్సు నారోహించుచున్నది; పెద్దలచేఁ బ్రతిష్ఠింపబడినఱాయియే దేవుఁడగుచుండఁగా మనుష్యునిగూర్చి చెప్పవలయునదేమి? చూడరాదా! విష్ణుగుప్తుని (చాణక్యుని) యనుగ్రహమున నధికారహీనుఁడగు చంద్రగుప్తునకు సామ్రాజ్యము ప్రాప్తించినది. బ్రాహ్మణక్షత్రియవైశ్యులలో నొకనిని, స్వదేశవాసిని, జన్మము, నాచారము, బాగడ్త, వీనియందు శ్రేష్ఠుని, వ్యసనరహితుని, వ్యభిచారహీనుని, నఖిలవ్యవహారయోగ్యమగు మంత్రతంత్రములు నెఱిఁగినవానిని, సమస్తోపాధులుగల వానిని, బరిశుద్ధునిమంత్రినిగాఁ జేయవలయును. పక్షపాతములన్నిటిలో స్వదేశపక్షపాతము గొప్పది. విషబిందువులు చల్లినట్లు దురాచారము సకల సుగుణములను బాడుచేయును. దుష్టసేవకులు గల రాజెపుడైన నకృత్యములు చేయుట

డు.) రాత్రిగాని పగలు కాని స్థలశోధనము చేయకుండ మంత్రాలోచనము గావించిన చో గూఢచారులు గాని మత్తులుగాని మంత్రభేదముం జేసెదరు. ఒకరాత్రియందుఁ బ్రచ్ఛన్నముగా వరరుచి యను వి * "అప్రశిఖ" యను ప్రశ్నకుఁ బిశాచములవలన రహస్యముం దెలిసికొని యానాలుగక్షరములుఁ జరణములపొందట నచ్చునట్లొకశ్లోకమును జేసి నట్లు వినుచున్నాము గదా!

ఆశ్లోక మెట్లన:—అనేన తవపుత్రేణ । ప్రసుప్తస్య వనాంతరే
శిఖామాక్రమ్య పాదేన । ఖడ్గేనోపహతం శిరః. అని.

పక్షాంతరము నవకారము చేయువారితో (మంత్రిభేదనము చేయుదురను సందేహముగలవారితో) నాలోచనము చేయరాదు. ఆలోచనసభ వారితో సంబంధము లేనివాఁడవు డక్కడనుండఁగూడదు. చిలుకలు గోరువంకలు మున్నగు తిర్యగ్జంతువులే యొకప్పుడు రహస్యము వెల్లడిచేసినట్లు వినుచున్నారము గదా. మంత్రిభేదమువలనఁ గలిగిన వ్యసనము తీరనిదిగా నుండును. ఇంగితము, ఆకారము, మదము, ప్రమాదము, ప్రతిశూవము, నిద్ర, యూహా అను మంత్రిభేదమగుటకు హేతువులు. అన్యథావృత్తి (అభిప్రాయమును వ్యక్తీకరించు నవయవచేష్ట) యింగితము. ఆకారమనఁ గోపప్రసాదాదులచేఁ బుట్టిన శరీరవికారము. పానము, స్త్రీసంగము మున్నగువానిచేఁ బొడమిన హర్షము మదమగును. చేయఁగూడనిది చేయవచ్చునని గాని చేయఁదగినదానిం జేయరాదని

* నందుని పుత్రుఁడైన హిరణ్యగుప్తుఁడు వేటకుఁబోయి రాత్రివేళనొకచో సిం త్రియమునఁజేరి తనయొద్ద నిద్రించు నొకపురుషుని నఱకెను. ఆపురుషుఁడు మృతినొందుచు "అప్రిశిఖ" యనిపలికెను. మిత్రద్రోహము వలనఁ గలిగిన దోషముచేఁ దత్క్షణమే బుద్ధిచెడి నందపుత్రుఁడు "అప్రిశిఖ, అప్రిశిఖ" యని పిచ్చివానివలెఁ బలుకుచుఁ దిరుగఁజొచ్చెను. క్రమముగాఁ దండ్రియొద్దకిఁ దీసికొనిరాఁబడెను. వేఱుమాటలులేక "అప్రిశిఖ" యనిపలుమాఱుపలుకుచుండ నందరాజు సభలోని కవులను దిక్కునవారినడిగినఁ గారణ మెవ్వరును జెప్పలేకపోయిరి. వరరుచి యేమూహించిచెప్పెదనని రాత్రి మఱ్ఱిచెట్టుమీఁద రహస్యముగఁ గూర్చుండి పిశాచములు చెప్పుకొను నీసంభాషణము విని వచ్చి శ్లోకము చేసినాఁడు ఈశ్లోకమునకర్థము. నీకుమారుఁడనైన నేను అడవిలో నిద్రించువానిని సిగ కాలితోఁదొక్కిపట్టి తలనఱికితివి." అని యీరహస్యము జనులకు వెల్లడికాఁగానే విష్ణుగుప్తుఁడు మరల జ్ఞానముకలవాఁడయ్యెను. (కథాసరిత్సాగరము, కథాపీఠలంబకము 5 తరంగములోఁగలదు.)

గాని తలంచుట యట్లు చేయుట ప్రమాదము. తలంచినది వేఱుగాఁ బరిణమించుట యుఁ బ్రమాదమె. గోత్రస్ఖలనాది హేతువును నదియే. ఆలోచించినకార్యమును గావించుట యందాలస్యముతగదు. చేయుటయందిష్టములేని పనులంగూర్చి యాలోచనచే నేమిలాభము. తగినమందుందెలిసికొన్నంతనే వ్యాధినివారణమగునా, అవివేకముకంటె శత్రుఁడులేఁడు. తానుసేయఁగలిగినపనిని బరునిచేఁ జేయించువాఁ డౌషధముయొక్క వెలదెలిసికొనినంతనె రోగము నివారింప నూహించును

ఎవఁడెట్టివానితో సంబంధము కలిగియుండునో వాఁడు వానితోడి యుత్కర్షాపకర్షలు గలవాఁడగును. అధికారిచేఁ బ్రభుత్వమీఁబడిన మేఁకయును సింహమగును. మంత్రిసమయమున మంత్రులతోఁ గలహించి స్వేచ్ఛాలాపములాడఁగూడదు. లఘూపాయముచే మహాకార్యము నెఱవేర్చుట మంత్రిముఖ్యుని ఫలముగానుండవలెను. మంత్రములేకుండ నల్పాయాసమున గొప్పపనిజరగదు. భూమిపైనున్న పెద్దఱాయి కఱ్ఱతో మెడ్డగించిన లేచినట్లు చేతితోలేవదుగా. రాజునిష్టమునకు విరోధముగాకుండ నకార్యమును గార్యమువలె జరపించు మంత్రిశత్రుఁడు. అకార్యము నాశనహేతువు. ఇచ్ఛావిరుద్ధము చేసిన యధిపతి కోపించినపుడు మంత్రి యిచ్చుటమేలుగాని యకార్యమొనర్చి దానిని నశింపఁజేయరాదు. త్రాగఁగూడనియపుడు పాలు త్రాగఁబోయినను బిడ్డలను దలిదండ్రులు గొట్టుచున్నారు. మంత్రి యద్వితీయమగు రాజాభ్యుదయమేకాన నతఁడెవ్వరితోను సంబంధము కలిగియుండఁ జనదు. రాజొక్కరిపైనిగ్రహానుగ్రహములు చూపిన మంత్రియు నట్లే చూపవలయును. (పైనఁజెప్పినట్లు మంత్రి యెవరితోనైన సంబంధస్నేహాదులు కలిగియున్నచో రాజు కోపగించినపుడు తాను దయచూపును. దానివలన రాజాభ్యుదయమునకు విరోధియగును) చక్కఁగ నాలోచించిచేసిన పని ప్రతికూలమైనచో నది దైవప్రతికూలమున నయినదిగాని మంత్రిలోపమునఁగాదు. మంత్రిని గాదని సంచరించువాఁడు రాజశబ్దమునకుఁ దగఁడు. నరపాలునకు దురాగ్రహములేకుండినతోఁ బరబలాబలవిమర్శనముచేసి కావించిన మంత్రమువలన కార్యసిద్ధి తప్పకయగును. పరాక్రమము కనఁబఱపని నృపుని నీతి కోమటిచేతిలోని కత్తివంటిది. నీతియే సాధ్యాసాధ్యముల స్వరూపముం దెల్పును. హితాహితముల ప్రాప్తియుఁ బరిహారమును పురుషప్రయత్నాయత్తములై యుండును. ఆలస్యము చేయుటకు వలనుపడని పనుల నవశ్యమగువాని శీఘ్రముగ నొనర్పఁదగును; కాలమతిక్రమించినచో నకార్యము గోటితోఁబోవునదియైనను గొడ్డలి కావలసివచ్చును. బ్రతికియుండిన యుష్యుండేని సులభసాధ్యమగు కార్యము నసాధ్యమగునట్లు చేసికొనునా! ఒక్కమంత్రి పనికిరాఁ

ము. ఒక్కఁడైనచో నిరర్గళముగఁ జరించును, అనేకకార్యములయపుడు సందిగ్ధుఁడు చే న్నాఁడు. ("జ్ఞాతసారోపి ఖల్వేకః సందిగ్ధే కార్యవస్తుని" యని చెప్పినట్లు జ్ఞానవంతుఁ డైనను నసహాయుఁడు సందిగ్ధమునం జిక్కుకొనును.) ఇరువురు మంత్రులు గూడదు. ఇ ద్దఱుం గూడి ధనాదులపహరించుచు రాజును జెఱచెదరు. ముగ్గురుగాని యైదుగురుగా ని యేడుగురుగాని యుండవలయును. వేసిగానున్న జనులకైకమత్యము దుర్లభము. ఎ క్కుడుగానున్నయెడల నొకరికంటె నొకరు నిపుణులుకావలయునని యుత్కర్షఁజూ పెదరు. స్వేచ్ఛాసంచారము వారికి వలనుపడదు. బహుబాధము ననపాయమునగు కజము నొనర్పఁదగు. పండినఫలమును భుజించిననే జీర్ణమగును యథోక్తగుణస మవాయముగల మంత్రులిద్దరైన నొకఁడైన దోసములేదు. గ్రుడ్డివారు పెక్కుర్కూడి నను దేనిరూపముగాని చూడఁజాలరు. అవార్యవీర్యములగు రెండెద్దులను బెద్దబరువులా గుటకు నియోగించుటలేదా. బహుసహాయములుగల రాజు సర్వజనుల మనోరథములం దీర్చును. ఏకపురుషుఁడనేకకార్యములలో నెట్లు తన్ను విభాగించుకొనును. ఒక్క కొమ్మగల చెట్టు పెద్దనీడ నిచ్చునా? కార్యము సమీపించినపుడు పురుషులను బోగు చేసికొనుట దుర్లభము. ఇల్లంటుకొనినపుడు నూయిత్రవ్వుటయెట్లు. పురుషసంగ్రహ ముకంటె ధనసంగ్రహము గొప్పదని తలఁపరాదు. సుక్షేత్రమునఁ జల్లినబీజములవలెనే కార్యపురుషులయెడ నుపయోగించిన ధనము నూఱురెట్లు ఫలించును. వదనవ్యాపారము నకు, ధనమునకు, యుద్ధమునకు సహాయులగువారు కార్యపురుషులు. భోజనసమయమున నెవ్వరికెవ్వరు సహాయులుగారు? శ్రోత్రియుఁడు గానివానికి శ్రాద్ధసమయమున వలెమూ ర్ఖునకు మంత్రాలోచనసమయమున నధికారములేదు. గ్రుడ్డివాఁడెట్లు చూడఁగలఁడు. అం ధునిచే నడపింపఁబడు నంధునకు దారిసరియైనది దొరకదు. మూర్ఖులమంత్రమునను నొ కప్పుడు కార్యసిద్ధి † కాకతాళీయమువంటిది. మూర్ఖుఁడొకవేళ కార్యముంగుఱితేఁగిన ను నది ‡ ఘుణాక్షరన్యాయమువంటిది. చూపులేని కన్నువలెనే శాస్త్రములేని హృద యము దేనినిఁ జూపలేదు. ప్రభుకరుణయే సంపదలు చేర్చుఁగాని సత్కులముగాని

---

† కాకతాళీయము. తాటిపండుపడుటకు సిద్ధముగానున్నపుడు కాకిదానిమీఁద వాలును: కాకిదానిపై నెక్కకపోయినను రాలుటకు పండు సన్నాహముతోనే యు న్నది. అయినను కాకివాలుటచేఁ బడెనని యొకకారణ మగుపడుచున్నది.

‡ ఘుణమనునది కఱ్ఱలు మొదలగునవిదొలుచుపురుఁగు. కఱ్ఱలలో గీఁతలుగీఁతలుగా దొ లుచుచుండ నాగీతలొకప్పుడొక యక్షరమగును. దాని నాపురుగెఱిఁగియే వ్రాసిన దా? కాదు.

పాండిత్యము గాని చేర్పదు. కేవలంతముం గాఁగిలించుకొన్నను గాలకూటము కాలకూటముగా నేయున్నది. (పథుకరుణ లేకయే. ఉన్నయెడలనది పాలసముద్రమునం బుట్టినకతన (పత్కులీరంతిచే) నమృతమువంటిది కావలసినది) మూర్ఖులయందు రాజ్యభారము నిల్పుట తన్ను జంపుకొనుటకై యాభిచారిక మంత్రము జపించుటవంటిది. ఆచార్యవాదులకు శాస్త్రములతోఁ బనిలేదు. నారికేళధనుస్సు దూదేకువిల్లుకంటె హీనమైనది. కన్నులున్నవారికివలె మంత్రులకును యథార్థదర్శన మాత్మ గౌరవహేతువు. శస్త్రపండితులు మంత్రిపండితులు కారు. (కేవలశూరులు మంత్రిత్వమునకుం దగరనుట) యుద్ధము చేయు రాజపుత్రునకు గౌరవము కలుగును. కత్తిపట్టిజీవించువానికి కలహమే యన్నముఁ కలహాన్నములేకున్న పక్వాన్నము జీర్ణింపదు. మంత్రాధికారము, స్వామిప్రసాదము, శస్త్రోపజీవనము నివి యొక్కొక్కటియే పురుషుని గౌరవనీయుం జేయును. అన్నియు నొక్కచోనున్నయెడల నడుగవలయునా.

స్త్రీధనాదిలోభముగలవాని కధికారమీయరాదు. అర్థగ్రహణలాలసులగు మంత్రులున్న రాజు కార్యములు సాగవు. ధనమును జేరదు. వివాహము నిమిత్తము కన్యను జూచిరమ్మని పంపఁబడినయాతఁడే పెండ్లియాడిన నిఁక దిక్కేది? వండెడుపాత్రే యన్నమంతయుఁ దినిన జనులకిక్కడేయాన? కావున వందియును కుములు నిస్ప్రహులు నగువారికిఁ బరస్త్రీదర్శనమును ధనసంచయమును గాదు. అతికాముకగలవాడు చేయనిపనిలేదు. కామవశుఁడగు ప్రజాపతి కూఁతునందును శ్రీపతి గోపవధువులయందును, హరుఁడు శంతను భార్యయందును, నింద్రుఁడు గౌతముభార్యయందుఁ జంద్రుఁడు బృహస్పతి యిల్లాలియందుఁ దగులము చేసి రని వినుచున్నారము గదా! అర్థమునందు (ధనమునందు) తినని, కుడువని, చెల్లే యభిలాషపడుచుండఁగా మనుష్యుల కభిలాషమెట్లుండదు? లాభము వచ్చునపుడు లోభ మెవ్వరికిఁ గలుగదు? ఎవనికిఁ బరస్త్రీ పరధనములయందు నిస్పృహ కలుగునో వాఁడు ప్రత్యక్షదైవము. కార్యపురుషుని దూషించుట నిద్రపోవుచున్న సర్పమును లేపుటకు సమానము. ఎవనివలనఁ జిత్తవికారము కలుగునో వానిని దరిఁజేర్పరాదు. మనసుగాని పటికంపు మసగుగాని విరిగినచో నే జెవ్వఁడు మరల నతుకఁ గలఁడు? అల్పాపరాధమున్నయెడల గొప్పయుపకారము చేసినను జిత్తానురాగము కలుగదు. సూచీముఖసర్పమువలె నేయపరాధముం బొందినవా రపకృతి చేయుదురు విడువరు. హేస్త్రుదలచేఁ రథసముగఁ గార్యారంభము చేయువారి యాదాయవ్యయములు సమము గానుండును. అతికష్టపడి యల్పఫలమును మహామూర్ఖులు గడింతురు. కాపురుషులు దోషభయమునఁ బ్రారంభమే చేయరు. మృగములబాధయుండునని సస్య

ము చేయకుందురా? అజీర్ణభయమున భోజనము మానుకొందురా? భూత భవిష్యద్వర్త
మానములలో నెవ్వఁడు నెవ్వరికిని బ్రత్యవాయము లేకుండఁ గార్యారంభము కాదు.
పరిపక్వ ప్రాజ్ఞులుకానివారదియగునా కాదా యనుసందేహముతోఁ బ్రారంభింతురు.
దూరమేగవలయునను భయమున నార్తులపై క్రూరత్వమును హీనలక్షణము. స్వ
తస్సిద్ధముగ నీరుమృదువైనదైనను నెత్తునుండిపడుచుఁ బర్వతములను భేదించునట్లే సహజ
మార్దవులగు రాజులు సమర్థులనుగూడ భేదించి చంపుదురు. ప్రియంవదుఁడగు పరపా
లుఁడు నెమలివలెనే పరసర్పముల హింసించును. (నెమలి తనశబ్దమునందిచ్చపడి వచ్చి
నసర్పములను దినునఁట) విపత్తులలో ధైర్యమవలంబించువాఁడు గొప్పవాఁడు. పరులకు
ఉపద్రవము కల్గించుటయే సర్వకార్యసిద్ధులకు మొదట నాటంకకారణము. అకులీనులు
శరత్కాల మేఘములవలె వృథాగర్జనముం జేయుదురు. మహానుభావులు పనిచేయకుండ
మనస్సులోని యర్థానర్థములను వెల్లడిచేయరు. పాలుగలచెట్లవలెనే మహాత్ముల పలుకు
లు సఫలములగును. (పాలుగలచెట్లు తప్పక ఫలించునఁట) కడిమిచెట్టువలె (నెక్కుటకు
వలనులేనిచెట్లవలెఁ) దండింపక (కట్టితోఁ గొట్టినఁగాని) నీచుల ప్రకృతి ఫలము నివ్వదు.
ఏవస్తువుగాని స్వభావముచేతనే సుందరమైనదిలేదు. ఎవ్వరిప్రకృతి యెట్టిదో యట్టివ
స్తువును బ్రేమించుచుందురు. అదియే వారికి సుందరవస్తువగుచున్నది. విష్ఠాప్రియుల
యందువలె మక్షికాదులకుఁ గర్పూరరేణువులందును మొగలిపువ్వులమీఁదను బ్రీతి
యుండదు. అతిక్రోధముగలవాని ప్రభుత్వము నిప్పులలో వేసిన యుప్పురాయివలె న
నేకవిధములభిన్నమగును. యుక్తాయుక్తవివేకశూన్యుఁడుసర్వసుగుణములను జెఱచును.
ఇతరులకు రహస్యము జెప్పుట వానికిఁ దన్నమ్ముకొనుటయే. పరులను నమ్ముట య
జాకృపాణీయము వంటిది. (కత్తినినమ్మిన మేక భేదింపఁబడుచున్నది.) చంచల చిత్తుఁ
డు కించిత్తైనను సాధింపలేఁడు. స్వతంత్రుఁ డంతటికి నొక్కసారి సహాయము చేసి యు
న్నవములం జెఱచుచున్నాఁడు. మందుఁడేపనికిని దగఁడు. ప్రమాదవంతుఁడు నిశ్చ
యముగ విరోధులకు దొరకును. తనకుఁ బ్రతికూలానుకూలములను జేసికొనలేఁడు.

ప్రత్యవాయసహితమైనను బ్రాణరక్షకొఱకుఁ బ్రయోగించినకార్యమును ముఖ్య
ముగాఁ జేయవలయును. తనశక్తిఁదాఁ దెలియంగనివాఁడు బలవంతులతో వైరము పూనుట
చచ్చువేళకుఁ బురుఁగులకు ఱెక్కలువచ్చినట్లుండును. (ఱెక్కలు వచ్చినపురుఁగు దీ
పముమీఁదికో యెగిరి మృతినొందును) తనకనువగుకాలము దొరకుదాఁక వైరితో స్నే
హము పూనియుండవలెను. తగులఁబెట్టవలసినదయినను గట్టెపుడకలను మొదటఁ జనులు నెత్తి
పైఁబెట్టికొని పోయుటలేదా? నదీవేగము మొదట తీరమునందలి వృక్షముల పాద

ములుకడిగి విదపఁ బెకలించుచున్నయది. తొందర (గర్వము) గలయతఁడు చేతిలోని కివచ్చినదానిం జెఱచికొనును. కోపశాంతి కుపాయ మెఱుంగనివానికిఁ గొంచెము గొప్ప యని తెలియదు. ఒడ్డులు మించఁ బాఱు నదిమంచిచెట్టును జెడ్డచెట్టును గూడఁ గూల్చినట్లు కోపపూర్ణుఁడైనవాఁ డందఱిం జెఱచును. జ్ఞానవృద్ధులు లేనియపుడు యుక్తమైన వాక్యమును బాలుఁడు చెప్పినను గ్రహింపఁదగును. సూర్యుఁడు లేనియపుడు దీపము కాంతి నిచ్చుటలేదా! చిన్నకిటికీలోనుండి వచ్చువెలుఁ గిల్లంతను బ్రకాశింపఁ జేయును. పెండ్లికాఁబోవుకన్యలవలెనే వాక్యములును పరార్థ్యములు. (ఇతరుల కొఱకు నియమింపఁబడినవి, శ్రేష్ఠమైనవి.) అయినను నిరర్థకప్రయోజనము కావింపరాదు, అట్లయి వచో నవశ్యము నవి జనకులను (తల్లిదండ్రులను, వాక్యములనుచ్చరించిన వారిని) శపించును. పలికినపలుకుల విశేషార్థము నెఱుంగనివానిపలుకు పలుకనిదానితో సమానమగును. పరులకనర్థదాయకమగుమాటలాడు నాతఁడు పిశాచసముఁడుఁ బాపాత్ముఁడును. విద్యానిలయుఁడైనను నీతిలేనివాని ప్రతిభ స్వల్పప్రకాశముగల దీపమువలె నిష్ప్రయోజనము. అప్రియముఁదలఁచినవాని ప్రాణముతీయుటయే మేలు. అధికదోషములు గలవానికి క్షణకాలదుఃఖదాయకమగు శిక్ష యనుగ్రహమువంటిదేయగును. స్వామిదోషమువలన స్వదోషమువలన వృత్తిచ్ఛేదులైన సేవకాదులు క్రోధముచేతను లోభము చేతను భీతిచేతను అవమానము చేతను కృత్యసమానులగుదురు. (కృత్యమనఁగాఁ జారణ మారణాది మంత్రములచే నిర్మింపఁబడిన యొకశక్తి) అట్టివారిని వశము చేసికొనుటకు వారియిష్టానుసారము మెలఁగుటయు, నభయంబొసఁగుటయు, దానము చేయుటయు, సత్కృతి యొనర్చుటయు నుపాయములు. నాశనముగాని, ధనాదిలోభముగాని, వైరాగ్యముగాని మంత్రులు వారియెడఁ దలంపరాదు. అంతఃకోపముకంటెను మంత్రుల కోపము పెద్దది. (రాజ్యమూలమైన మంత్రికోపమువలన రాజ్యమునకుహాని కలుగవచ్చును) చిక్కఁబడని దుష్టస్వభావముగలవారిని గుహలలోపలబంధించియుఁ గారాగారమునఁ బెట్టి పనులు చేయించియుఁ గ్లేశపెట్ట వలయును. అటులైన లొంగుపాటునకు వత్తురు. నేరము చేయువానితోను జేయించువానితోను సహవాసము చేయరాదు. అట్టివాఁడు గృహములోఁ బ్రవేశించిన పామువలె సర్వానర్థములకు మార్గమగును. క్రుద్ధుని యెదుట నెప్పుడు నిలువరాదు. క్రుద్ధుఁడు సర్పమువలె నెదుటనున్నవానిమీఁదనే రోషవిషమును విడుచుచున్నాఁడు. ప్రతివిధానము చేయలేని యాతని యభ్యాగమనముకంటె ననాగమనము లెస్స.

## 11. పురోహితసముద్దేశము.

ప్రఖ్యాతకులశీలుని షడంగములతోడి వేదమునందు, గ్రహోత్పాతాది దైవనిమి
త్తమున, దండనీతిలోఁ బ్రవీణుని, అథర్వవేదము నేర్చినవానిని, అతి వినీతుని, దైవమా
నుషములచే సంభవించు నాపదలం దొలఁగించువానినిగా నెన్ని పురోహితుని జేసికొన
వలయును. రాజునకు మంత్రిపురోహితులే తల్లిదండ్రులు. కావున వారేదికోరిన నద్దు
చెప్పరాదు. దుర్వినయమున బాధింపరాదు. అమానుషములగు నగ్ని, వర్షావర్షములు,
మారక దుర్భిక్ష సస్యోపఘాతజంతూత్సర్గ వ్యాధిభూతపిశాచశాకినీసర్ప వ్యాలమూషక
క్షోభము లాపవలనఁబడును. రాజపుత్రుఁడు సర్వభాషాలిపులు, గణితశాస్త్రము, పదప్ర
మాణప్రయోగకర్మముగల నీతివిద్య, రత్నపరీక్ష, సంభోగ, గృహవాద్య (వీణాదికము)
రణవాద్య (భేరులు మొదలగునవి) విద్యలు, చక్కఁగ నెఱిఁగి యుండవలయును. అ
స్వాతంత్ర్యము, శక్తకారిత్వము, నియమము, వినీతత, అర్థమునివి గురూపాసనా కార
ణములు. వ్రతవిద్యావయోధికుల యెడఁ గ్రిందుఁబడియుండుటకు వినయమని పేరు. పు
ణ్యప్రాప్తియు, శాస్త్రరహస్యపరిజ్ఞానమును, సత్పురుషసేవయును వినయఫలములు. అ
భ్యాసము కార్యములయందలి కౌశల్యమును గలిగించును......గురువచనమును మీఱ
రాదు, అధర్మానుచితాచారముల విషయమై మీఱినను దోషములేదు. ప్రత్యవాయవిష
యమై యుక్తాయుక్తములను గురువే యెఱుఁగును. వానికి విరోధముగాఁగాని ప్రతివా
దము చేయువాఁడుగాఁ గాని శిష్యుఁ డుండరాదు. గురుజనులు రోషముపొందినపు
డుత్తరము పల్కకుండుటయు సేవించుటయునే దాని కౌషధము. శత్రువుల కెదురు న
డచు పురుషుఁడు కీర్తిపడయును గాని గురువుల కెదురునడచువాఁడు పడయఁడు. ఆరా
ధ్యులకుఁ గోపము పుట్టింపరాదు. అట్లయినచో నాశ్రితులకు మేలు కోరరు. గురువు
చెప్పినదాని నతిక్రమించిన నైహికాముష్మికఫలము చేరదు. సందేహములను గురువున
కుఁ గోపము కలుగకుండనడుగవలయును. వారి యెదుట యథేష్టముగా నేమియుఁ దిన
రాదు. ఉక్తి, జాతి, శ్రుతము వీనియందు సమానుఁడైనను నమస్కరింపకుండ నుపా
ధ్యాయుల నుండి విద్యను గ్రహింపఁజనదు. అధ్యయనకాలమున నాసంగము, (మనసు
నింకొకచో నిల్పుట) పారిప్లవముఁ (చాపలము) గూడదు. సహాధ్యాయి నీకంటె బుద్ధి
కలవాఁడైనచో వానిపై ననూయవలదు. ప్రజ్ఞాతిశయముచే గురువును జిన్నపుచ్చరాదు.
కామఁడైనను దనకార్యమును తల్లిదండ్రులపైఁ జూపు నతఁడెట్టివాఁడు ? గురువు సెల
వు లేనిది వేఱొకచోటికిఁ జనరాదు. ఒంటరిగా దారినడచుటయును, నీరిలో దిగుట
యును, కొండయెక్కుటయుఁ దగదు. తండ్రినివలె నొజ్జల నుపచరింపవలయును. గు

రుభార్యను దల్లివలె మన్నింపఁ జనును. గురుపుత్త్రుం గురునట్లె చూచునది. కూడఁ జదు
వువానిని బంధువునట్లు స్నేహము చూపఁదగును. పదాఱేండ్ల దనుక బ్రహ్మచర్యము
నడపి, పిదప గోదానము (కేశఖండనసంస్కారము) నొనర్పఁదగును. ప్రతిదినమును దో
డివారితోఁ గూడి నేర్చినదాని వల్లించుచుండవలయును. గృహచ్ఛిద్రము (దుస్థితి)
లాగంతుకులయొద్ద వెలిపుచ్చఁదలదు. పరగృహములం దల్లవారను విక్రమార్కులంతటి
వారగుచున్నారు. (తమధనము వ్యయము కాదు కావున) స్వగృహమున నిట్టివాఁడు
గొప్పవాఁడు. పరకార్యములలో శీతలుఁడు కానివాఁ డెవ్వఁడు? రాజాసన్నులంద
ఱును సాధువులే. కృపణులను బతిమాలుట కేవల దైన్యప్రకటనమునకే కాని నిష్ఫల
ము. అర్థార్థియై వచ్చినవాఁడు నమస్కారాదిప్రణయకార్యములచేఁ (ధనములేకుండ)
దృప్తినందఁడు. ఆశ్రితులలో నెవ్వరికైనఁ గార్యవశమున లేక విశేషకారణ మేదైన
నుండిన నాతనిం బారితోషికాదుల సంభావించునది కాని దర్శనప్రియభాషణాదులచే
నేకాంతములాడుచుఁ దనకున్న ప్రేమను రాజు వెలికిఁ దెల్పరాదు. సమప్రవృత్తిగాను
న్నఁ దంత్రము చక్కఁగ నడచును. ఛేదము కనఁబడిన నితరులు విరోధింతురు. స్వల్ప
ద్రవ్యము గలవానినుండి సొమ్ముఁ గొనుట చచ్చినవానిం జంపుటవంటిది. పెట్టుకొన్న
మొఱకుఁ బ్రతివిధానము నాలోచింపనివానితో మనవిచేయుట యరణ్యరోదనము వంటి
ది. అవిచారికి యుక్తులుచెప్పుట యముకవంపురీతి యగు. నీచుల కుపకారము చేయు
ట నీరిలోఁజల్లిన యుప్పునకు సమానము. విశేషములను గ్రహింపఁజాలని వానియెడలఁ
జేసిన ప్రయాసమంతయు నెండిపోయిన వనిం దరించుటకుఁ దుల్యమగును. పరోక్షమం
దొనర్చిన యుపకారము నిద్రించువాని పాదము లొత్తినట్లు నిష్ఫలము. సమయము మిం
చినపిమ్మట చేసికొను విజ్ఞాపనము చౌటినేల దున్నినట్లు యగును. ఉపకారము చేసి
దానినుద్ఘాటించుట వైరము నెఱపించుట యట్టిది. ఫలవంతముగాని(ధనమీయని)రాజప్రసా
దము రెల్లుపువ్వువంటిది. (రెల్లు తెల్లని పువ్వుపూసినది, పండు పండునని రొదురు
చూచుచుండ నిష్ఫలమగును) గుణదోషములను దెలిసికొనకుండ నన్నుగ్రహనిగ్రహము
లు చూపుట గ్రహాభినివేశమునకుఁ బోలిక. ఉపకారాపకారములు రెండును జేతఁగాని
వాని యనుగ్రహమును గోపమును దన్నుఁదాను కలాకోశము చేసికొనుటకు నవ్వుకములు
స్వగ్రామములోని నరాజకీయులగు స్త్రీలకుభయము పుట్టించునట్లు గర్జించువారు (ప్రలగ్భ
ములాడువారు) గ్రామశూరు లనిపించుకొందురు. (తమయూరు దాఁటిన గవ్వకు కూర
రమట) విధవముఁగాఁ బెఱుకుఁ గూడ నుపభోగ్యమైనచో కాని వ్యాధివలెఁ దాను
మాత్రమే యనుభవింపఁదగినది కాదు. అమాయాగర్వము కా బహుదోషములు గల్పించి

శిక్షించువాఁ డేమిగురువు? ఏమితండ్రి? ఏమిచెలి? చిరకాలము నుండి సేవించు సేవకులను గూడ నల్పదోషమునకు సహింపనివాఁ డేటిరాజు?

## 12. సేనాపతిసముద్దేశము.

అభిజనాచారము, ప్రాజ్ఞానురాగము, శౌచము, శౌర్యము, ప్రభావము, గలవాఁడును బహు బాంధవపరివారుఁడును, నిఖిలోపాయప్రయోగనిపుణుఁడు, సమస్తవాహనములు నెక్కుట, సకలాయుధయుద్ధముచేయుట, అశేషభాషలు మాటలాడుట, వ్రాయుట, నేర్పునతనము, సకలతంత్రసామంతాభిమతుఁడు, యుద్ధయోగ్యశరీరాకారుఁడు, ప్రభువునకభ్యుదయహితంబులఁ గోరువాఁడు, నిర్వికల్పుఁడు, తనగౌరవమునకుఁ దగినట్లు మర్యాదయు ధనమును బ్రభువుచేఁ గొనుచుండువాఁడు, ప్రతాపము సూచించునట్లీఁబడిన రాజచిహ్నములచే (కంచుక శిరోవేష్టనాదులపై లేకనామాదినోయంతమునవో) విరాజిల్లువాఁడు, సర్వక్లేశాయాసముల నోర్చుకొనునట్టివాఁడు, సేనాపతిగానుండఁదగును. అప్రభావము, స్త్రీజితత్వము, ఔద్ధత్యము, మూఢత, వ్యసనస్వభావము, క్షయవ్యయములకుఁ బరస్థలములందుండుటకు సహింపఁజాలకుండుట, తంత్రప్రతీకారము, నందటితో వైరము, పరులపై నిందలువేయుట, పరుషభాషిత్వము, ఉచితమెఱుఁగకపోవుట, అసంవిభాగిత్వము, స్వాతంత్ర్యముఁ, బొగడినఁబొంగుట, స్వామికార్యవ్యసనోపేక్ష, తోడివారు చేసినకార్యములఁ జెఱచుట, రాజహితముం దలఁచువారిపై నీర్ష్య యివి సేనాపతిదోషములు. నగరవాసితులవలెఁ (నగరమునందలి మంగలి) ప్రజలయెడల ననువర్తనగల రాజపురుషుఁడు చిరంజీవియగును.

## 13. దూతసముద్దేశము.

నియమింపబడిన కార్యములందు దూత మంత్రివంటివాఁడు. స్వామిభక్తి, వ్యసనము లేకయుండుట, దాక్ష్యము, శుచిత్వము, నిరోగిత, ప్రాగల్భ్యము, సమయస్ఫూర్తిత్వము, క్షాంతి, పరమర్మముం దెలియు శక్తి, జాతియు, నివి ముఖ్యమైన దూతగుణములు. నిసృష్టార్థుఁడు, పరిమితార్థుఁడు, శాసనహారుఁడు నని దూతలు ముత్తెఱఁగులవారు. ఎవఁడుచేసిన సంధివిగ్రహములు ప్రభువునకు సమ్మతములోవాఁడు నిసృష్టార్థుఁడు. కృష్ణుఁడు పాండవులకువలె. దూత తెలిసికొనకుండ శత్రుస్థానమును బ్రవేశింపరాదు. ప్రభువును గలసికొనుటకై వెడలిపోవను జనదు. శత్రువు తన్నవమానముచేసినను స్వకార్యము నిర్వహింపకుండ దూత మరలరాదు గూఢచారులు రాజునొద్దికిఁ జనఁదగదు. పరరాజులచేఁ దొందరగాఁ బంపఁబడిన దూతల నెందుకుఁబంపినారోయని కారణ

యూరకుండవలయును. పరులు ప్రయోగించిన కృత్యమునకు శాంతియొనర్చుట, స్వకృత్యోత్థాపనము, కార్యభేదనము, సుతులు, దాయాదులు, బందీకృతులు, వీరిని ధనాదులచే భేదబుద్ధిగలవారిం జేయుట, తమదేశములోనికి వచ్చిన గూఢపురుషుల నెఱింగికొనుట, అంతఃపురపాలకుల, నాటవికుల, సంబంధుల, కోశము, దేశము, తంత్రము, మిత్రులు, అంతఃపురము, కన్యారత్న వాహన తీక్ష్ణపురుష (గూఢవధచేయువారు) ప్రయోగములు నిత్యముం బరీక్షించుట యనునవి దూతకర్మములు. దూత పరరాజులమంత్రులు, పురోహితులు, సేనాపతులు, వీరికుపచారములు చేయుచు నమ్మికపుట్ట మెలఁగి వారివలన రాజులతలంపులు నంతస్సారమును దెలియునది. అశస్త్రుఁడగునపుడు తన్నుఁగూర్చి పరులనుననిష్టవాక్యములను సహించి యుండవలయును.

గురువును స్వామిని నిందించునపుడు శాంతింపరాదు. దానున్న రాష్ట్రమువిడిచి పరరాష్ట్రమునకుఁ బోయి మరలవచ్చిన నది నాశహేతువు. దూత తాను వీరపురుషులతోఁగూడి శూరజనాంతర్గతుం డగుపరదూత నెఱుంగుచుండవలయును. చాణక్యుఁడు తీక్ష్ణదూతలఁ బ్రయోగించి నందునిఁ జంపినటుల వినుచున్నారముగదా! శత్రువు లంపిన జాబులు కానుకలు మున్నగునవి చక్కఁగఁ బరీక్షింపకుండఁ బుచ్చుకొనరాదు. మున్ను ముట్టుకొన్నంతనే శరీరమున విషమెక్కునట్టి సుగంధవస్త్రములం గానుకలంపి కరహాటప్రభువు కైటభుఁడు వసువనురాజును, తాఁకినంతన పాము విసము దేహమునం బ్రసరించునట్లు కల్పించిన రత్నపేటికఁ బంపి కరవాలకరాళునిం జంపినట్లు తెలియవచ్చుచున్నయది. మహాపకారముం జేసినదూతను జంపవచ్చును. యుద్ధము పొసఁగినపిమ్మటఁగూడ రాజులు దూతముఖులై యుండవలెను. (దూతలను విడువరాదనుట. వారు పాములు కుపయోగింతురని) దూతయై వచ్చినవాఁడు చండాలుఁడైనను వధ్యుఁడుకాఁడు, అట్టిచో బ్రాహ్మణదూతను జంపుదురా! దూతను జంపరు కావున నతఁడు హితాహితములగు సర్వవాక్యములను స్పష్టముగాఁ బల్కును. బుద్ధిమంతుఁడైనచో దూతమాటలవలనఁ గుక్క మొఱుగుట వలన తనయొక్కయు నెదుటివానియొక్కయు నుత్కర్షాపకర్షములను లెక్కింపఁడు. కావున విశేషరహస్యములం దెలిసికొనుటకై పరదూతలకు స్త్రీలను జీతముల నిచ్చియు వానిగుణాచారములు శీలము వీనిం బట్టియు స్వపరబలాబలముల నిర్ణయింపవలయును. విరోధులకు వ్రాయునుత్తరములను నాలుగుచుట్లుచుట్టి మీఁద ఖడ్గముద్రవేయవలయును (దూత "వకీలు" వంటివాఁడు.)

## 14. చారసముద్దేశము.

స్వదేశమునఁ బరదేశమునఁ గల కార్యాకార్యములం గాంచుటకు రాజులకుఁ జారులే నేత్రములు. చాపల్యములేక యుండుట, యసత్యమాడకుండుట, ఊహించి పరమర్మములం దెలిసికొనుటయు నివి చారునిగుణములు. చారులకుఁ బహుమానములచేఁ దృప్తినిచేయుటయేకాని వెలజీతముల నిర్ణయములేదు. బహుమతులు దొరకునను నుత్సాహముచే స్వామికార్యము గావించుటకుఁ ద్వరపడుచుందురు. చారులఁబంపునపుడేదో యొక సంకేతమును బెట్టిపంపుచుండవలయును. ఆసంకేతము ననుసరించి వాఁడువాఁడు చెప్పినది సత్యమని తెలిసికొనుచుండవలయును. లేకున్న నిద్దఱు ముగ్గురుఁ గూడి ధనాశచే నేకవాక్యముగాఁ బలికిన సత్యమిది యని తెలిసికొనుటకైతి గాకుండను. చారులు లేని రాజు తమవారిచేతఁ బరులచేత నిందింపఁబడును. యామికులులేని రాజునకు రాత్రి సుఖమెక్కడిది? కార్పటిక, ఉదాస్థితిక, గృహపతిక, వైదేహిక, తాపస, కితవ, కిరాత, అక్షికాలిక, యమపట్టిక, అహితుండిక, శౌండిక, శౌభిక, పాటచ్చర, విట, విదూషక, పీఠమర్దక, నర్తక, గాయక, వాదక, వాగ్జీవ, గణక, శాకునిక, భిషక్, ఐంద్రజాలిక, నైమిత్తిక, సూద, ఆరాలిక, సంవాహక, తీక్ష్ణ, రసద, క్రూర, జడ, మూక, బధిర, అంధ, ఛద్మములు రాకపోకలచేయు చారవర్గములోనివారు. వీరివలనఁ బరవృత్తాంతము తెలియఁబడుచున్నది. పరమర్మజ్ఞుఁడై ప్రగల్భశిష్యవేషముగలవాఁడు కార్పటికుఁడనఁబడును. ఏదోయొక సమయముచూచి తాను గురువుగాఁ బెక్కండ్రు శిష్యులను గూడఁబెట్టికొని రాజుచేఁ బోషింపఁబడుచుఁ బ్రజ్ఞాతిశయము గలవాఁడుదాస్థితుఁడు. గృహపతిక వైదేహికులు గ్రామకూట శ్రేష్ఠులు. కుటిలతపోవిద్యలచే లోకమున దంభము నూపువాఁడు తాపసుఁడు. కితవులు జూదమాడువారు. అల్పాఖిల (పొట్టిపొడుగు) శరీరావయవములుగలవాఁడు కిరాతుఁడు. అక్షికాలిక యమపట్టికులనువారు ప్రతిగృహమునకుఁబోయి కాసిపటములు మొదలగు బొమ్మలగుడ్డలు చూపించువారు. ఆహితుండికుఁడు పాములనాడించువాఁడు. మద్యగృహాధికారి శౌండికుఁడు. రాత్రులయందు తెరమఱుఁగున పలువిధములగు నామరూపముల నగపించువాఁడు శౌభికుఁడు (వేసగాఁడు). పాటచ్చరుఁడు దొంగ లేక బందీకారుఁడు. విటుఁడు కుంటెనకాఁడు. అందఱికి నవ్వుఁబుట్టించువాఁడు విదూషకుఁడు. కామశాస్త్రాచార్యుఁడు పీఠమర్దకుఁడు. గీతాంగపటా (స్త్రీవేషమువేయు వస్త్రములు) దులచే నృత్యవృత్తిగలవాఁడు నర్తకుఁడు. నాటకరంగమందభినయకర్తయు. భోగముపడఁతులకువృత్తినుపదేశించు నాతఁడు గాయకుఁడు. గీతప్రబంధగతివిశేష వాదకముగు చతుర్విధవాద్యము

ల నెతింగినతండు వావదుకుడు. వాగ్మి వైతాళికుఁడు (రాజులయొద్ద మేలుకొల్పువాఁ
డు.) మాగధుఁడును గావచ్చును. గణకుఁడు లెక్కనేర్చినవాఁడు లేక దైవజ్ఞుఁడు
(జ్యోతిష్కుఁడు.) శాకునికుఁడు శకునములఁ జెప్పును. భిషజుఁడు ఆయుర్వేద శాస్త్ర
ప్రకారము వైద్యమును శస్త్రకర్మమును తెలిసినవాఁడు. ఐంద్రజాలికుఁడొరులకు వినో
దముగామంత్రతంత్రములను జేయునట్టివాఁడు. నిమిత్తములం దెల్పువాఁడు నైమి
త్తికుఁడు; దైవజ్ఞుఁడును గావచ్చును. (వీరియువురును ముందిట్లగునట్లగునని కీడుమేళ్ల
ను దెల్పువారు.) వంటచేయువాఁడు సూదుఁడు, రుచ్యభక్ష్యములను జేయునతఁడారాళి
కుఁడు. ఒడలుఁగాలుసేతులుఁ బిసికి పట్టు వ్యాపారము నేర్చినవాఁడు సంవాహకుఁడు.
బరువు మోయువాఁడైన నగును. ధనమునకై కష్టపడి పనిచేసి జీవించువాఁడు తీక్ష్ణుఁడు.
రసదులు చరులు. ఎల్లప్పుడు బంధువులందు స్నేహశూన్యుఁడు క్రూరుఁడు. మిగిలినవారు
ప్రసిద్ధులగుటచే నిచట వివరింపలేదు.

## 15 విచారసముద్దేశము.

విచారింపకుండ నొకకార్యమును జేయువలదు. ప్రత్యక్షానుమానాగమములచే వస్తు
వు యొక్క యథాస్థితిని దెలిసికొనుటకు విచారమనఁబడును. ప్రత్యక్షమనఁగాఁ దాను
జూచినది. ప్రజ్ఞావంతులకు తామొకన్నులతోఁ గాంచకుండఁ దెలిసికొన్నంతన ప్రవృత్తి
నివృత్తులు కలుగవు. స్వయముగా గనుఁగొనినను నొకప్పుడు మనస్సున సంశయము విప
ర్యాసము మోహమును గలుగుచుండఁగాఁ బరులు చెప్పినదాని నమ్ముట యెట్లు? ఎవఁడు
ప్రత్యక్షోపలబ్ధవస్తువును గూడ సాధువిమర్శ చేసి కార్యము నాచరించునో వాఁడు వి
చారజ్ఞుఁడు. అతిరభసముగ నొనర్చిన కార్యము లనర్థమును బుట్టించుట కాక్షేపణ
మేమి? విచారింపకుండ నొనర్చి పిమ్మట దానికిఁ బ్రతివిధానము చేయఁబోవుట నీరు
పోయినపిదప సేతుబంధము చేయుటవంటిది. చేయఁబడిన పనిని బట్టి రెండవపని
నూహించుట యనుమానము. చేసినకార్యములో నొకభాగమును బట్టి ముందు చే
యఁబోవు పని నంతయు విచారింపవలెను. ఆకారము, కార్యము, ప్రజ్ఞ, సంపద, ఆయ
తి, వినయము, నివి రాజపుత్రుల భావిరాజ్యసూచకములు. స్వభావమునకు వికారదర్శ
నమే ప్రాణుల భవిష్యచ్ఛుభాశుభములకుఁ జిహ్నము. ఒకకార్యమున దృష్టబుద్ధియ
గువాని పరిపూర్ణము రెండవదానిం జేయుట యందేలనమర్థముకాదు. ఆప్తులగు పురుషు
లుపదేశించినది యాగమము. అనుభూతానుమితశ్రుతార్థములను సందేహములేకుండఁ జె
ప్పు పురుషుఁడాప్తుఁడు. యుక్తియుక్తముకాని వాక్యముచ్చరింపఁబడిన నుచ్చరింపఁబ
డనిదట్టిదే. వక్తయొక్క గౌరవమును బట్టియే యతఁడుపలికిన మాటకును గౌరవము

కలుగును, గాని స్వతస్సిద్ధముగా మాటకు గౌరవములేదు. మితంపచుల (కృపణుల) ధ
నము, చండాలవాటికలోని నూతినీరితరవర్ణములకుపయోగింపనియట్లు తమసంతానమున
కుపయోగింపదు. లోకము గతానుగతికము. (ఒకరినిజూచి యొకరాచరించునది.) గోవధ
ము చేయు బ్రాహ్మణుని సదుపదేశములు చేయుకులటను లోకము సదుపదేశములందుఁ
బ్రమాణముగా నంగీకరింపదు.

## 16 వ్యసనసముద్దేశము.

వ్యసనము మనస్సును మరలించి శుభములం దొలఁగించునది కావున దానికాపేరు
కలిగెను. అది సహజమని యాహార్యమని రెండువిధములు సహజవ్యసనము (జన్మముతోఁ
గూడఁ బుట్టినది.) ధర్మకార్యములచేఁ బొడమిన యభ్యుదయములను, అధర్మజనితప్ర
త్యవాయములను బోధించునుపాఖ్యానములచేతను యోగ్యపురుషులచేతను (యుక్తులు నే
ర్చిన పురుషులచేతను శాంతించును. పరిచితుఁడును, ననుకూలమైన యుపాయముచే మ
నస్సునం దగిలియున్న వ్యసనమునుండి విరక్తిం బుట్టించు శ్రేయోయోగ్యపురుషుఁ
డనఁబడును. శిష్టజనసహవాసమున దుష్టజనసాంగత్యముచేఁ బురాతనమహాపురుషులచారిత్ర
ములచేఁ గల్గిన గాఢలనలన సహార్యమగు వ్యసనముం బ్రతిబంధింపవచ్చును. అనవరతస్త్రీ
సంబంధము గలయతఁడు నిశ్చయముగఁ నపుంసకుండగును. ధాతునష్టము సర్వనష్టమును
గలిగించును, మధుపానరతుఁ డొడలు తెలియనికతన మాతృద్రోహమును జేయఁగలఁ
డు. వేఁటాడువాఁడు గాసర్పవిరోధిదాయాదులలో నెవ్వరికైన నాహారమగును. జూ
దమాడువానికి కృత్యాకృత్యములేదు; తల్లియింటికడ ప్రాతివోంటను ద్యూతమును మానఁడు.
పిశునుఁడు కపటముచే సంపదిని న[illegible]ంచును. పగటినిద్ర నిద్రపోవుచున్న రోగిసర్పము
ను లేపుఁ గల్పవంటిది. అతని కార్యము లన్నియును చెడును. పరనిందకుంటె సకల
జనులతో వైరముపూనుటకు వేఱొండు మందులేదు. గీతవాద్యములయం దాసక్తుమే
నను మానప్రాణములను ధనంబును హరింపదు? ఎక్కుడు చూపోపమి గలవారినన్న
ముకు బుట్టింపకుండఁ దమపని విడువదు. పరదారరతుఁడు తనభార్యను విడుచును, ఒ
కప్పుడు చంపివేయఁగలఁడు. కన్యాహరణము రావణాదులకు వినాశహేతువైనది. అర్థ
దూషణముచేఁ గుబేరుఁడైన బిచ్చగాఁడగును. అర్థదూషణవలన నతివ్యయము, లేదా
యపాత్రవ్యయము. అకారణ వాక్పారుష్యములచే గర్విష్ఠుఁడైనం జూపదు. మనుష్యులఁ జె
ప్పనేల. నిష్కారణభూతసమానము చేసిన యిల్వలుఁడు వాతాపి యనువార లగస్త్యుని
[illegible] వినపచ్చుచున్నదిగదా! దోషము ననుసరించి కోటిధనము పుచ్చు

కొనినను బ్రజ దుఃఖపడదు. అన్యాయముగ గడ్డిపరక యైనఁ బోవుటకొప్పదు. ట్టుం
జంపి పండ్లుగొనరాదు. ప్రజలవిభవమే రాజునకుఁ బెద్దధనాగారము. కావున రాజు
యుక్తియుక్తముగా ధనము వారివలన గ్రహింపఁదగును. రాజు చేపట్టు గడ్డియైనను
బంగారగును. దేనిచే నొరుల మనసు నొచ్చునో యామాటకే వాక్పారుష్యమని
నామము. భార్యను, బిడ్డలను సేవకులను గూడ వినినంతన మనశ్శల్యమువలె నుండనివా
క్యములతో గౌరవింపఁజనును. అక్రమముగ వధించుట, దుఃఖపెట్టుట, ధనము గొను
ట యనునవి దండపారుష్య మనంబడు. ఈవ్యసనములలో నొకదానిం దగిలినవాఁడే చ
తురంగబల సంపన్నుఁడైనను ప్రభువు చెడుచుండ నీపదునెనిమిదింటిం దగుల్కొనిన
వాఁడు చెడుటకు వింతయేమి.

## 17 స్వామిసముద్దేశము.

ధార్మికుఁడు, కులాచారాభిజనావిశుద్ధుఁడు ప్రతాపవంతుఁడు న్యాయవృత్తి గల
వాఁడును స్వామియనంబడును. కోపప్రసాదములకంటె స్వతంత్రుఁడై తన్నతిక్రమించి
న జనులను దండించువాఁడును స్వామి. సర్వప్రకృతులును (ప్రజ మంత్రులు మొదలగు
వారు) స్వామితోనున్నయవి. తలంచిన తలంపును వినియోగించుకొనుటకు స్వామిలేని
వారు చాలరు. మొదలులేనిచెట్టునందు బుద్ధిశాలుల యత్నమేమిచేయఁగలదు? అసత్య
మాడువాని సర్వసుగుణములు వినాశమొందును. వంచకులకు ధనము, పరివారము, దీర్ఘా
యువు నుండవు. లోకమునకు ధనమిచ్చువాఁడు ప్రియుఁడు. అడిగినవాని మనస్సు చి
న్నపుచ్చనివాఁడే దాత. ఉపకారము చేసి నిస్పృహులగుటయుఁ బిమ్మట ప్రత్యుపకా
రము చేయనేమో యని భయపడుటయును సనార్యగుణుల యలోకసామాన్యమగు మ
నస్థైర్యము. ఉపకారి కుపకారము చేయుట దాపుడు ధనమునకు వడ్డినిచ్చుటవంటిది. ప
రులసొమ్ము తిని ప్రత్యుపకారముచే వారిని సంభావింపనియెడల జన్మాంతరముందును వాఁ
డు ఋణపడియుండును. పాలీయని యావేల? ఆశాపూర్తి చేయని స్వామిప్రసాదమే
టికి? క్షుద్రుల సహవాసముగల స్వామి పామున్న గేహమువలె చేరికకు బనికిరాఁడు.
కృతఘ్నున కాపదలో నొక్కఁడును సాహాయ్యము చేయఁడు. విశేషజ్ఞుఁడు కాని
స్వామిని బుధులాశ్రయింపరు. తనపొట్టతాను నింపుకొనువానిని భార్యయైన విడుచును.
ఉత్సాహము లేకయుండుటయే సర్వదుఃఖములును వచ్చుటకు దారి. శౌర్యము, కోప
ము లేకయుండుట, శీఘ్రకారిత్వము, సాయోగ్యములయందుఁ బ్రవీణత యను నివి యు
త్సాహగుణములు. అన్యాయవృత్తి గలవాని సంపద చిరకాలముండదు. న్యాయ్యపు

న్యాయముగ హిత మహితముగఁ జేయువాడుతమవారిచేఁ బరులచేఁ గొట్టఁబడును.
స్వామియాజ్ఞవలననే యైశ్వర్యమును బడయును దదాజ్ఞ యెవ్వరును దాఁటఁగూడదు.
ఆజ్ఞోల్లంఘనచేసినపుత్రునిగూడ సహింపరాదు. ఆజ్ఞవెట్టనిరాజు చిత్రపటములో ను
న్నయట్లే యుండుంగాని వానివిశేష మేమియునుండదు. ఒకసారి రాజాజ్ఞోల్లంఘనము
చేసి శిక్షింపఁబడినవాఁడు మరలనట్లే చేసినచో నుత్తమసాహసదండమును విధింపవల
యును (ఉత్తమసాహసదండమనగా 1000 పణములుగాని 1108 గాని యపరాధము
విధించుట) నేరములేనివానికి శిక్షవిధించిన యాయధికారి కాశిక్షయే విధింపవలయును
పరమర్మభేదనముం జేయు ననత్యవాది నుపేక్షింపరాదు; అట్టిది యించుకంతయును బ
నికి రాదు. వేషమును వానివృత్తాంతమును తెలియకుండ నెవ్వనిని భజింపఁగూడదు. ప్ర
భువు వికారస్వభావము గలవాడయినచో వికారచేష్ట లేలయుండవు? అధర్మపరుఁడ
గు రాజునకధర్మముం దలంపనివాఁడెవ్వఁడు? రాజవమానించినవాఁడందఱిచే నవమా
నింపఁబడును. పూజింపఁబడినవాఁడు పూజింపఁబడును. ప్రజాకార్యమును దానే విచా
రింపవలయును. ప్రభువందఱకు సమయానుగుణముగ దర్శనసులభుఁడు కాఁదగును.
దుర్దశగలరాజు సేవకజనులచేఁ గార్యవిపర్యాసముం బొందుచున్నాఁడు, విరోధులచే
నెమకొనఁబడుచున్నాఁడు. శ్రీమంతులవ్యాధివర్ధనమునకన్న వైద్యులకును రాజులవ్యస
నవర్ధనముకంటె నియోగులకును జీవనోపాయములేదు. కార్యార్థులైనపురుషులను లంచ
గొందులు దోచుకొనియెదరు. లంచములం గొనువారికి భూతబలిం జేయఁగాదు- లంచమే
యన్నిపాపములకు నాగమనద్వారము. లంచమువలనఁ జీవించువారు తల్లిస్తనముం గూ
డ గ్రహించుచున్నారు. లంచముం బుచ్చుకొనుటచేఁ గార్యాభిరుద్ధుఁడగు స్వామి వి
క్రయనొనర్చుచున్నాఁడు. లంచముచే రాజునకైనలాభము రాజమందిరములను ధ్వంస
ము చేసి యినుపమేకును గడించుటవంటిది. రాజులంచముంగొని పనిసెఱవేర్చుట యెవ్వ
రికిఁ బ్రియము! దేవతలుగూడ దొంగలలోఁ జేరినచోఁ బ్రజలకుఁ గుశలమెక్కడిది.
లంచముచే నష్టోపాయమును గనఁబఱచి దేశము, కోశము, తంత్రము మిత్రమును భక్షిం
చుచున్నాఁడు. రాజన్యాయ్య మొనర్చుట సముద్రము తన హద్దుదాఁటుటవంటిది
యు, సూర్యుఁడు చీఁకటిని జెందుటవంటిదియుఁ, తల్లి బిడ్డలను దినుటకీతిదియు నగు
కలికాలవిజృంభణము. రాజవిశిష్టకాలమునకుఁ గారణుఁడు. రాజు న్యాయపరిపాలన
ము చేయుచుండెనేని జనులకు దిక్కులు కామధేనువువంటివి. వర్షములు సకాలమున గు
రియును. సర్వేతిబాధలును శాంతించును. దిక్పాలురందఱును నరనాయకుననువర్తించె
దరు. దానిచే నారాజు మధ్యమలోకపాలుఁడైన నుత్తమునిగా నెన్నుదురు. వేఁట

జూదములు మున్నగు వ్యసనములు లేకయే ధననష్టము నొందినవానికి రాజు మూలధనము ని చ్చి సంభావింపవలయును. రాజునకు సముద్రావధియగు భూమియే స్వకుటుంబమును వంశవర్ధనక్షేత్రములే కళత్రములు, కార్యార్థులకుపకృతి చేయఁదలపనివాఁడు వారిచ్చు కానుకలం గ్రహింపరాదు. ఆగంతుకులతోడను నోర్వలేనితనము గలవారితోడను బరిహాసము లాడఁగూడదు. పూజ్యుల నెదిరించి భాషింపఁదగదు. చేతఁగాని భృత్యులను బహుమతు లిచ్చెదమని యాసచూపి కష్టపెట్టఁజనదు. పురుషుఁడు ధనమునకు దాసుఁడుగాని పురుషునకు గాఁదు. ధనహీనుఁడెవ్వఁడు చులకన గాఁడు? సర్వధనములలో విద్యయే యొరులకు హరింపరానిదగుటను గూడ వచ్చునదగుటను ప్రధానధనము. నది సముద్రునిఁ వలె విద్య నీచోపగతయయ్యు వానికి దుర్దర్శనుఁడగు రాజుం గూర్చును. పిమ్మట భాగ్యములం జేర్చును. సమస్తజగత్స్థితిపరిజ్ఞానముం గూర్చు విద్య పండితులకుఁ గామధేనువు. లోకవ్యవహారముం దెలిసిన మూర్ఖుఁడైనను సర్వజ్ఞుఁడగు. లోకజ్ఞానములేని ప్రాజ్ఞుఁడు నవమానముం బొందును. పరులకు బోధించువారే ప్రాజ్ఞులు. అనుపయోగమగు సముద్రములోని నీరెంతయున్న నేమి.

## 18 అమాత్యసముద్దేశము.

చతురంగబలయుతుఁడైనను రాజు మంత్రిలేనిచో శోభిల్లఁడనిన నొక్కని మాట చెప్పవలయునా? ఒక్కనికిఁ గార్యసిద్ధి కాదు. ఒకచక్రము తిరుగునా? గాని సమిధ గాసున్న యగ్ని కట్టెలున్నను మండునా? సత్ప్రతిజ్ఞోపకర్తలవలనను దానమానముల వలనను రాజుతోఁగూడనుత్పత్తివిపత్తులుగలవారలే యమాత్యులు. ఆయవ్యయ స్వామి రక్షాతంత్రపోషణమే యమాత్యుని యధికారము. ఆయవ్యయములయందు మునికపుండలువే నిదర్శనము. (మునికపుండలువు వెడల్పునోటితోఁ దగ్గకడుపు నిండునట్లు త్వరగా నీరుపీల్చి జలము నిచ్చునప్పుడు తలచిన్నకొమ్మువెంట కొంచముగా నిచ్చును) ఆయమన ద్రవ్యోత్పత్తిక్రమము. వ్యయమన ప్రభువునానతి ననుసరించి సెలవు చేయుట. ఆయమును బాగుగా నాలోచించి వ్యయము చేయనివాఁడు కుబేరుఁడైనను సన్న్యాసియగును. స్వామియన రాజవాక్యము, తన్నామము తద్ధర్మము, తత్కళత్రాపత్యములును నగును.. తంత్రమన చతురంగబలము. క్రూరస్వభావుని, అశుచిని, వ్యసనిని, హీనకులుని, బలవత్పక్షము గలవానిని, మరలింపఁదరము గానివానిని, అతివ్యయము చేయువానిని, అల్పాదాయము గలవానిని, విదేశములనుండి వచ్చినవానిని అతిలోమలమైనవాని నమాత్యునిగాఁ జేసికొనరాదు. క్రూరస్వభావుఁడు పరులచే నభియోగింపఁబడి దాను జచ్చును లేదా

స్వామిని గెడపును. బలవత్పక్షుఁడు తాను నియోగింపఁబడిన పనియందుండియు జలప్ర
వాహమువలె మత్తగజము రీతిని నృపవృక్షమును వ్రేళ్లతో నుండి పెకలించును. అల్పాదాయ
ముగలవాడు నతివ్యయము చేయువాడును రాజద్రవ్యమును హరించును. విదేశము లనుం
డి వచ్చినవారి కర్థాధికారమిచ్చిన నుండియుండి యెందో పోయెదరు. లేదా యపకా
రము చేయుదురు. స్వదేశస్థుని కర్థాధికారమిచ్చిన వఁడు ధనముహరించినను నూతిలో
వేసిన ధనము వలె నెప్పటికైన దొరకఁగలదు. అతికోమలుని వలన లాభమపేక్షించుట రా
తిలోనుండి వస్త్రము దీయుటవంటిది. స్వామియందుఁగల దోషములను చెప్పఁగా గ్ర
హించుటకును సుగుణములున్న ననుగ్రహించుటకు సమర్థుఁడైనవాఁడే యధికారి. అ
మాత్యుఁడు బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, సంబంధి వీరధికారులు గారాదు. బ్రాహ్మణుఁడు
స్వజాతిస్వభావముచే ధనమిచ్చినవిచ్చును లేదా! యూరకుండును. క్షత్రియుఁ డభియోగ
మునఁ గత్తిపట్టుకొనును. జ్ఞాతిభావముచేత సంబంధి సమవాయాతిక్రమణముగ ధనమంత
యు మ్రింగివేయును బంధువులు శ్రోత్ర మైత్ర యౌన భేదములచే సంబంధులు మూఁ
డు తెఱఁగులు. పితృపైతామహక్రమముగవచ్చువాఁడు శ్రోతుఁడు. తానుగూర్చుకొన్న వాఁ
డు తనంతట వచ్చినవాఁడు మైత్రుఁడు. యోనిసంబంధముగలవాఁడు యౌనుఁడు. మై
త్రాదులయందు సంబంధాంతరాసక్తి యుండఁగూడదు. అపరాధమున్నపుడు పేక్షించి పి
దప పశ్చాత్తప్తుఁ డగువాని కధికారమీయరాదు. మానవంతు నధికారిఁజేసిన నధికారి
నష్టము చేయుచు నిరవగ్రహముగ సంచరించును. చిరకాలము నుండి సేవించుచున్న వాని
కధికారమిచ్చిన రాజున కపకారము చేయుటకు శంకింపఁడు. ఉపకారము చేయు స్వ
భావముగలవాఁ డధికారియైనచో నాయుపకారము పేరుపెట్టి సర్వధనము హరించును.
చిన్నతనమునుండి తనతో నాడుచుండు వాని కధికారమునిచ్చిన నతిపరిచయము
చేఁ దానే రాజని వర్తించును. లోన దుష్టస్వభావము గలవాఁ డధికారియైనయెడల
సర్వానర్థముల నుత్పాదించును. శకుని, శకటాలు లిందులకు దృష్టాంతము. స్నేహితున
కధికారము రాఁగా నవశ్యము ధనమిత్రనాశనమగును. మూర్ఖాధికారియున్న, రాజా
ధర్మార్థయశస్సులకు సందేహ మగును. అనర్థనరకపాతములు నిశ్చయము. స్వామిప్రసా
దముచే గర్వించినయధికారి చిరకాలము వర్ధిల్లును. తనకు క్లేశము గలిగినను రాజునకు
సౌఖ్యమును గార్యసాధనములు జేయుని పరిజనముతో నేమిపని. గడ్డిపఱక లేరికొనితిను
నేనుఁగునకు సుఖమెక్కడిది? అస్త్రనిపుణులు పనులయందు నియోగింపఁబడి విపరీతకా
ర్యములం జేయుదురు. కావున వారిని దినదినమును బరీక్షింపనగును. అమాత్యులనునమ్ముట
పిల్లులను పాలకొఱకుఁ గాపుపెట్టినట్లు. "బుద్ధిస్తత్త్వవికారిణీనియోగినాం" అని పెద్ద

లు చెప్పుదురు. అనఁగా నైశ్వర్యవృద్ధి మంత్రుల చిత్తవికారముం జేయుననుట. ప్ర
తిపురుషుఁడు నాయులాభములచే సాధ్యుఁడగును. అతిసమృద్ధుఁడగు కృచ్ఛ్రసాధ్యుఁ
డు స్వామిపదాభిలాషి భక్షణము, ఉపేక్షణము, అశ్రద్ధ, ప్రజ్ఞాహీనత్వము, ఉపరోధ
ము (అడ్డగింత) ప్రాప్తార్థాప్రవేశము, ద్రవ్యవినిమయము నివి యమాత్యదోషములు. రా
జ్యతంత్రము బహ్వాధికారముఖమున నిర్వహింపఁబడినది. స్త్రీలవిషయమున ధనవిషయ
మున స్వజాతీయున కధికార మీయరాదు. స్వపరదేశముల నపేక్షింపని యధికార
మనిత్యము. ఆదాయక, నిబంధక, శత్రునాశకు లగు రాజ్యాధ్యక్షులే కరణములు. ఆయ
వ్యయవిపర్యాసము కలిగినపుడు నేర్పుగల కరణములచేఁ దన్నిశ్చయమును జేయఁదగు
ను. నిత్యపరీక్షణమును వేఱొకయుద్యోగమునకు మార్చుట, ప్రతిపత్తిదానము నియోగు
లవిషయమున నర్థగ్రహణోపాయము. పీడింపకుండ నియోగులనుండియు దుష్టవ్రణము
ల నుండియు నంతస్సారము వెడలదు. తఱచుగ నియోగులను నభయపూర్వకాహ్వాన
ము చేయుచున్న రాజులకు సువర్ణవర్షము కురియును. మాటిమాటికి పిండుచుండిన
స్నానవస్త్రము (కొల్లాయిగుడ్డ) దళముగా నెట్లుండును. దేశమును పీడింపకుండ బుద్ధి
చేతను బురుషకారముచేతను వెనుకటిపన్నులను పెంచుచు ధనమానముల నొందఁదగు.
ఎవ్వఁడేపనియందుఁ గుశలుఁడో వానినాపనియందే నియమింపఁదగును. సేవకుల కార్య
నిబంధనహేతువులు బుద్ధిపురుషకారములేఁ గాని స్వామిప్రసాదము గాదు. చూ
డకుండఁ జేయువాఁడు శాస్త్రవేత్తయైనను గర్మలయందు విషాదముం జెందును. ఆ
పత్ప్రతీకారమునం గాక మఱొక్కప్పుడు రాజునకు నివేదింపకుండ నింతయుఁ గార్య
ముం జేయరాదు. కపటచౌర్యాదులవలన నకస్మాల్లాభముం బొందిన వణిజుని మూలధ
న మాత్రావశిష్టునిగాఁ జేయవలయును. మూలధనముకంటె ద్విగుణాధికలాభముగడించు
వ్యాపారి రాజునకు ధనాగారమువంటివాఁడు. నియోగులు పరస్పరకలహముం జెందుట
రాజులకు నిధిలభించుటయే. నియోగులలక్ష్మి ప్రభువుల రెండవ ధనపుఁగొట్టు. అన్నిటి
లో ధాన్యసంగ్రహము గొప్పది. మనుష్యులకు జీవికాధారప్రయత్నముకంటె నితరము
వ్యర్థము. విశేషధనము నోటఁబెట్టుకొన్నను ధాన్యమువలెఁ బ్రాణత్రాణమును జేయఁ
జాలదు ధాన్యములలోఁ జిరకాలముండునవియాఢ్యు. ప్రాఁతధాన్యమిచ్చి క్రొత్తధాన్య
ముగూడఁగొనుచుండవలెను. అన్నిరసములలో లవణసంగ్రహముత్తమము. ఎన్నిరసము
లుంగూడిన యాహారమైనను లవణమిళితము కానిచో గోమయతుల్యము.

## 19 జనపతిసముద్దేశము.

పశుధాన్యహిరణ్యసంపదచే రాజిల్లునది రాజ్యము. రాజున కధికారము కోశము ను వృద్ధిని నిర్దేశించునది దేశము. వివిధవస్తుప్రదానముచేత స్వామిగృహమున గజాశ్వాదికము విశేషింపఁజేయునది విషయము. సర్వకామములం దీర్చుటచే నరపతి హృదయముమండనముఁ జేయునది మండలము. వర్ణాశ్రమాచారలక్షణమునకుఁ గాని ద్రవ్యోత్పత్తికిఁ గాని స్థానము జనపదము. జనపతి యుత్కర్ష కారణమున హృదయదారణము చేయునది దారకము. అమాత్యసమృద్ధిచే స్వామిని సర్వవ్యసనములనుండి నిర్గమింపఁజేయునది నిర్గమము. జనపద మనఁగా:-అన్యోన్యరక్షకమైనదియు, బంగారు మొదలగు ఖనిజధనమును ఏనుఁగులు గలదియు, అతివృద్ధులు నతిహీనులు లేని గ్రామములతో నిండినదియు బహుపదార్థయుతము, ధాన్యహిరణ్యములచే లాభము నొందు సంగడులు గలదియు బంటలకు నదులయాధారము కలది పశువులకు జనులకు హితమైనదియు, శ్రేణులు, (వడ్రంగి సాలీఁడు మంగలి చాకలి మాల మాదిగ రాళ్లుచెక్కుపనివాండ్రు, శిల్పులు) శూద్రులు సేవ్యగాండ్రుం గలదియు, విషతృణోదకము (జబ్బుచేయు నీరును గడ్డియుఁ గలది) చౌడు, రాళ్లు, ముండ్లు గిరిగహ్వరములు గర్తములు వర్షాధారమునం బండు భూములు సర్పములు, చెదలు, మ్లేచ్ఛులు మిక్కుటముగఁ గల యూళ్లును స్వల్పసస్యోత్పత్తియుఁ దనుఫలాధారమును దేశదోషములు. దున్నని నేలను విత్తుచోటను వర్షాధారమునం బండు పొలములుగలచోటను సదా దుర్భిక్షము వాటిల్లును. క్షత్రియు లెక్కుడుగాఁగల గ్రామములలోఁ బ్రతిదినమును స్వల్పవిషయములలోఁ గూడ యుద్ధములు జరుగుచుండును. బ్రాహ్మణులు విశేషము నుండిరేని రాజులకు విధిగా నీయవలసిన ధనమైనను లుబ్ధత్వముచేఁ బ్రాణముపోయినను స్వాంతవచనములచే నీయరు. విదేశస్థుఁడు వచ్చి ముఖ్యోద్యోగముగాని మఱి యేదిగాని కోరినపుడు వాఁడుపద్రవకారియని తెలిసెనేని దానమానములచే నితరదేశములకుఁ బంపివేయవలయును. పరదేశప్రజ వచ్చి చేయు నుపద్రవము స్వల్పమైనను రాజునకు విశేషధనవ్యయకారణము. సస్యమిని గింజలు పాలు పోసుకొనుతఱి నుపద్రవము కలిగినచో నది జనులకు దుఃఖప్రదము. [illegible] నూర్పు దినములలో రాజసేనాప్రచారము కలిగిన దుర్భిక్షము రాకమానదు. ప్రజలకుఁ గల్గినబాధలన్నియు రాజకోశమును క్షీణింపఁజేయును. ఒకవేళ సేనాదికముచే నుపద్రవము జెందినప్రజకు రాజానష్టమిచ్చి యనుగ్రహింపనగు. మర్యాద నతిక్రమించినచో ఫలవంతమగు భూమియు మహారణ్యమగును. రాజు దీపవారిం గూడ ననుగ్రహించి కూడఁగట్టుకొనవలయును: సంగ్రహించిన యినుపమేకు సైత మొకప్పు డుపకరించును ఎల్లప్పు

డుఁ బ్రజల కేదియో యిసుమంత యుపకారము నొనర్చుచుండుటయే ప్రజల యభివృద్ధి కుపాయము. నగరంబుననున్న యాపణవీథి (బజారు) న్యాయముగాఁ బరిపాలించుకొన్నచో నదియే రాజునకుఁ గామధేనువగు. రాష్ట్రమునందలి గ్రామములలోని ప్రజలకుఁ గడుపునిండగ నన్నమున్నచో రాజునకు దచ్చతురంగబలంబులకును నభివృద్ధి యగుటకు సందియము లేదు. గొప్పయాలమందయు హిరణ్యాదికమును కోశాగారాభివృద్ధికి హేతువులు ఆవఱచిన నలువంకల కెంతదూరము వినఁబడునో యంతపరిమాణముగల భూమి దేవాగారంబులకును బ్రాహ్మణులకును నొసగుదాత కెందును లోపము రాదు ప్రతిగ్రహీతయు సంతసించును. ఒకఁడు తృణకంటకాదిభేదముం గావించి బాగుపఱచె నింకొకఁడు దానికిఁ బ్రాకారము నిర్మించె నింకొక్కఁ డందిల్లుఁ గట్టుకొనియె. నింకొకఁ డది ధర్మశాలఁ గావించె. నిం దెవ్వరికిం దెక్కువ బలమున్నదన్నచో నొకరికన్న నొకరు క్రమక్రమముగా బలవంతులు రాజచిహ్నము ధరింపకుండ నెవ్వఁడును మండలము నుండి పోరాదు రారాదు. ప్రవేశించువానిం గాని పోవువానిం గాని పరీక్షింపకుండ సీమాధికారి విడువరాదు. ఒకపలాశాధిపతి (వర్తకుని వేసము) పణ్యహస్తగ్రాహి వేసముఁ దాల్చిన భటులచే మండలపంతుం బ్రవేశించి చిత్రకూటముం గ్రహించెనని వినుచున్నాము కదా! ఖేటకఖడ్గధరుఁడైన మదురైఁడు కాంచీపురాధిపతిఁ లోఁగొనియెనని విందుము. వయ్యేల రాజాభియోగముకంటె సర్వజనవిశుద్ధి హేతువు మఱొండు లేదు.

## 20. దుర్గసముద్దేశము.

దేని నెదుర్కొనుటకు శత్రువులు దుఃఖపడుదురో యది దుర్గము నాఁబడు. విజిగీషువగు రాజునకు శత్రుజయోద్యోగవిషయమై కష్టము లేకుండఁ జేయునది దుర్గము గొందఱిమతము. ఆదుర్గము స్వాభావికమనియు నాహార్యమనియు రెండువిధములు. స్వాభావికమనఁ బ్రకృతిప్రాకారాదులు స్వతస్సిద్ధములుగాఁ గల ప్రదేశము. ఆహార్యమనం గల్పితంబులగు తాదృశప్రాకారములు కలది. ఉచ్ఛ్రితప్రదేశంబులను వహ్నిప్రజ్వలనోపాయంబును నింధనోదకసమృద్ధియు ధనధాన్య రసాదిసమృద్ధియుఁ బ్రవేశనిర్గమసాధనంబులును గలిగి వీరపురుషులచే సంరక్షింపఁబడుటయే దుర్గసంపద యనఁబడు. ఆదుర్గప్రదేశమున శత్రువుల కీసుమ్మర్దులు తిష్ఠింపకుండవలయును. ఆదుర్గప్రదేశము పరాధీనమున కాస్పదము. దుర్గములేని రాజు సముద్రమధ్యమున నోడనుండిపడినవానికిం బోలె నాపత్కాలమున వేఱ యాశ్రయము లేదు. తగిన సన్నాహము దానికిం దగిన యుపాయము. తంత్రములు పన్నుట దోషములు కల్పించుట ఘాతుకపురుషప్రయోగము నను నివి పరదుర్గలంఘనోపాయములు.

## 21. కోశసముద్దేశము.

సంపదాపదలు రెండింటియందును స్వామికిఁ దంత్రాభ్యుదయమును గూర్చుచు ధనముంగూర్చుకొనునది కోశము నాఁబడు. రత్నములు బంగారు వెండి విస్తారముగా నుండుట. వ్యవహారోపయోగములగల పెక్కువస్తువులుండుట ఆపదవచ్చినపుడు తటస్థమగు మహావ్యయంబున కోర్చుటయుఁ గోశలక్షణములు. రాజును గోశమే రక్షించునది. రాజునకుఁ గోశమే ప్రాణములుగాని ప్రాణములు ప్రాణములుగావు. కోశహీనుఁడగు రాజు రాష్ట్రము శూన్యమగునను భయంబునఁ బౌరులను జానపదులను నన్యాయముగాఁ దోచు. రాజనఁగాఁ గోశమేకాని రాజశరీరముకాదు. ఎవనిచేత ధనముకలదో వాఁడు విజయి, ధనహీనుఁడు భార్యచేఁగూడఁ విడువఁబడును. ఇతరులు విడుతురని చెప్పనేఁటికి. పురుషుఁడెన్నఁడును గులాచారమువలన సేవ్యుఁడుకాఁడు. విత్తమున్నచో సేవ్యుఁడగును. విత్తముగలవాఁడే మహాకులీనుఁడు సదాచారసంపన్నుఁడు, పరులను సంతసపఱచని మహాకులీనతయు సదాచారంబును వ్యర్థంబులు. నీరులేకపోయిన నెంతపెద్దచెఱువైన నేమి, దేవాగారములయు బ్రాహ్మణులయు ధర్మాధికారులయు సత్త్రాధికారులయు వర్తకులయు ధనవంతులును సంతానరహితులు నగు విధవలయు గ్రామాధికారులయు గణికలయు ననుపయోగియగు ద్రవ్యంబును రాజు కోశార్థమై బల్మినైన హరింపవచ్చును. మంత్రులయు ప్రజలయు ననుపయోగిద్రవ్యమేనియుఁ బ్రార్థనాపూర్వకంబుగఁ గ్రహించి కోశపూర్తిఁ గావింపవలయు.

## 22. బలసముద్దేశము.

ద్రవిణదానంబువలనను బ్రియభాషణంబువలనను నత్యాచారనివారణంబువలనను రాజుం గాపాడుంగాన బలమని చెప్పంబడు. చతురంగములయందును నేనుఁగులు ప్రధానాంగము. ఏనుఁగునకుఁ దన యవయవములే యాయుధములు. ఇతరబలమున కట్లుకాదు. రాజులవిజయమునకు దంతులే ప్రధానములు. ఒక్కయేనుఁగు సహస్రయోధులను జంపఁగలదు. వేయిమంది యోధులు తన్నుఁగొట్టినను నలయదు జాతి కులము వనప్రచారము. దంతావళములకు ముఖ్యమయినదికాదు. శరీరము బలము శౌర్యము శిక్ష తదుచితమగు సామగ్రియుఁ బ్రధానంబులు శిక్షింపఁబడని యేనుఁగులు రాజుల యర్థప్రాణములు హరించును. శిక్షితములగు నేనుఁగులున్నచో సుఖముగాఁ బ్రయాణముఁ జేయవచ్చును. శత్రుపురముల మర్దింపవచ్చు. పరవ్యూహములు భేదింపవచ్చు. నదులు మొదలగువానికానకట్టఁగా నుపయోగించుకొనవచ్చు. వెయ్యేల మాటలాడుట తప్ప నితరవి

నోవములన్నియుఁ బడయవచ్చును. హస్తిబలము సైన్యమునకు నడ నేర్చిన యాకారము అశ్వబలప్రధానుఁడగు రాజునకుఁ గదనకందుక క్రీడఁ గావించు సిరి ప్రసన్నయగు, దూరస్థులగు మాత్రులుగూడఁ జేతికి దొరకుదురు. ఆపదలయందుఁ దురంగములే మనోరథసిద్ధి (పారిపోవుట) కిఁ గారణములు. వెళ్ళుట పాఱుట యెదుర్కొనుట పరసైన్యభేదము. ఇవి తురంగసాధ్యములు. సమమైన భూమియు ధనుర్వేదపారంగతులయి ప్రహారకులగు ధానుష్కులు గలరాజునకుఁ బరవిజయము మన సెంతటిది. రథములచే మర్దింపఁబడిన సైన్యమును సుఖముగా జయింపవచ్చును.

ముందు మౌళికులయు దరువాత భృతకులయుఁ బిమ్మట శ్రేణీగతులయుఁ బదంపడి మిత్రులయు ననంతరమున నాటవికులయు బలమును ప్రోవుచేయుటకు రాజు ప్రయత్నింపవలెను. నితరబలమును నుత్సాహముకొలఁదిఁ జేర్చుకొనుటయును. విజిగీషువు విజయయాత్రయందుఁ బరసైన్యమును దగ్గించుటయందే ప్రయత్నించుటయు మిత్రభావంబును గత్తిదెబ్బలకోర్చుటయు నస్త్రప్రత్యస్త్రముల నెఱుఁగుటయు స్వభావశూరత్వంబును ననురక్తత్వంబును నను నివి భటగుణములు. మూలబలమునకు విరోధము రాకుండ నితరబలమును దా నర్థదానంబునను సన్మానంబునను ననుగ్రహింపవలయు. ఆపదయందును బాసిపోనిదియు నపరాధము జేసినను ద్రోహచింతసేయనిదియు నొరులకు నశక్యమయినదియు మూలబలము, ప్రభుసన్మానము సైన్యమున కుత్సాహముఁ గలుగఁజేసినట్లు ద్రవ్యవ్యయము కలుగఁజేయదు. స్వయముగా విమర్శింపకుండుట. ఆశపెట్టి ద్రవ్యమీయకుండుట. ఇచ్చుటకుఁ గాలయాపనముఁ జేయుట వ్యసనములనుండి మరల్పకుండుట. యుత్కృష్టకార్యమొనర్చినప్పుడు సన్మానింపకుండుట యనునివి సైన్యమునకు విరక్తికారణములు. తానువిమర్శింపక పరులచే విమర్శింపఁజేయఁబడు సైన్య మర్థతంత్రములకు దూరమగును. ఆశ్రితభరణంబునందును స్వామిసేవయందును ధర్మానుష్ఠానమందును భోజనమునందును శయనంబునందును ధర్మానుష్ఠానమందును బుత్రోత్పాదనమందును ప్రతినిధులు పనికిరారు. ఎంతయిచ్చిన భృత్యుఁడు సంపూర్ణమనోరథుఁడగునో యంతద్రవ్యము బహుమాన మొనఁగరాదు. తనద్రవ్యమును ఖర్చుపెట్టుకొనినవానిని రాజు దండింపరాదు. బుద్ధిమంతుఁడెవ్వఁడు తనయింటికిఁ దాను గన్నముద్రవ్వికొనును, కాలమున వర్షించని మేఘమెందులకు. ఆశ్రితులను వ్యసనమునుండి మరల్పని రాజు పనికిమాలినవాఁడు. కార్యాకార్యము లెఱింగిన రాజు సెందగ్గ ప్రాణవ్యయమైన సరకుగొనక సేవింపఁదగు.

## 23 మిత్రసముద్దేశము.

సంపదాపదలు రెండింటియందును విడువనివాఁడు మిత్రుఁడనంబడు, కారణంబు లేకుండ రక్షింపబడినవాఁడును రక్షించినవాఁడును నిత్యమిత్రుఁడు వాఁడు వంశపరంపరాసమాయాతుఁడు కావలయు. మఱియు శ్లాఘ్యసంబంధుఁడు కావలయును. జీవనాధారమునకై యెవ్వఁడు మైత్రి నెఱపునో! వాఁడు కృత్రిమమిత్రుఁడు. ఆపదలయందు విడువకుండుట ద్రవ్యమునెడఁ గాపట్యములేకుండుట స్త్రీలయెడఁ బరమశుచియగుట కోపానుగ్రహముల యందుఁ బ్రతికూలాప్రతికూలతలులేకుండుట. అనునివి మిత్రగుణములు. ద్రవ్యమొసఁగినఁ బ్రణయముఁ గనపఱచుట విపత్తునందుపేక్షించుట శత్రువులతో సహవాసముచేయుట మోసపుచ్చుట అతివినయము ననునివి మిత్రదోషములు, స్త్రీలతోడి చెలిమి వివాదపడుట సర్వదాయాచించుట. అన్యోన్యదోషము లాకర్ణించుటయు నివి స్నేహము చెడుటకుఁ గారణములు. పాలకంటె మైత్రిగల వస్తువు వేఱొండులేదు. కలసినంతమాత్రమున నీటినిఁ దనతో సమానమయినదానివలెఁ జేసికొనుచున్నవి, నీరముకంటెను మిత్రములేదు. తానుకలసినంతమాత్రమున క్షీరమును వృద్ధిపఱచును మఱియు వ్యసనము తటస్థించినతఱిఁ దానుక్షీణించును. తిర్యగ్జంతువులుసైత మేదోయొకయుపాయమునఁ బ్రత్యుపకారముఁ జేయుటయందు వ్యభిచరింపవు మనుజులుమాత్రమట్టివారుకారు తృణచ్ఛన్నమగునొక నూతఁ గ్రోఁతియు సర్పంబును సింహంబును నొకజూదరి దైవయోగంబునంబడిపోయిరి, ఆదారింబోవు బాటసారియొకఁడు దయాళుండై వారినుద్ధరించెనఁట పిదప ఘాతుకములగు తిర్యగ్జంతువులును నతని నుపకారించి చనినపిదప జూదరిమాత్రము వానితో మైత్రిఁగావించి యుజ్జయినీపురంబున నొకచోట నిద్రించియుండఁగా వానిద్రవ్యమంతయు హరించెననియు నొకయుపాఖ్యానము కలదు. మఱియు నాడీజంఘుఁడనువాఁడు గౌతమునిచేఁ జంపఁబడియె నని యుపాఖ్యానము కలదు.

## 24 రాజరక్షితసముద్దేశము.

రాజు రక్షింపఁబడిన నందఱు రక్షింపఁబడుదురు. కావున సౌమ్యుఁడగు రాజు నందఱు రక్షింపుచుండవలెను. వంశపరంపరితముగాఁ బితృపితామహుల నాఁటనుండియు వచ్చు వంశమందు జన్మించినవాఁడును శకితుఁడును ననురక్తుండును గృతవిద్యుఁడును నగువాని రాజు తనశరీరసంరక్షకునిఁగా నుంచుకోవలయును. మానమర్యాదలను ద్రవ్యంబును గొని యన్యదేశీయుని రక్షకునిఁ జేయరాదు. స్వదేశీయుఁడైనను నపకారమొకప్పుడు పొందిన వానినిఁ జేర్చరాదు.

మనోవికారమునకు మందులేదు. తల్లియుఁ బిచ్చిదైనచో రాక్షసికాదా! ప్రసిద్ధులు తెలివితేటలు గలవారైనను మంత్రులు చిత్తవికృతిగల రాజు నాపదనుండి తప్పింపలేరు. సమస్తావయవోపేతుఁడైనను దేహి గతప్రాణుఁడైనచో ధన్వంతరియంతటి వైద్యుఁడేనియు నేమిచేయఁగలఁడు, రాజునకు స్త్రీలాసన్నులు దాయాదులంతకంటె నాసన్నులు గావున మున్ను స్త్రీలవలనను పిదప దాయాదులవలనను దరువాతఁ బుత్రులవలనను రక్షింపఁబడవలయును. క్రోతి మొదలు చక్రవర్తివరకు స్త్రీలకొఱకై సమస్తకష్టములు పడుదురు స్త్రీలులేనిచో నేమియున్నను మృతాలంకారములు కావున స్త్రీలు క్షీరసముద్రతీరస్థలివలె విషమునకును నమృతంబునకును గూడ నాటపట్టులు. మొసలికోరలవలె నాండ్రు సహజముగ దుస్స్వభావము కలవారు. కావున వారిని వశపఱచుకొనుట దేవతలకేనియు నశక్యము రూపవతియు సౌభాగ్యవతియు సదాచారవతియు నిర్దుష్టయు నగు భార్య గొప్పపుణ్యము చేసినవారికిఁగాని లభింపదు అతికామము కలిగి మన్మథునకు వశవర్తినులగు కామినుల రక్షింప నెవ్వరికినిఁ దరముకాదు. పరపురుషులకుఁ జూపింపకుండుట. యవసరమైనచో సంభోగించుట. సర్వసాధారణముగా ద్రవ్యమొసఁగుట దర్శనాలాపములయందు సర్వసాధారణమగు వృత్తి కలుగుటయు నివియున్నచో నేకాంతయు నపరాధముఁ జేయదు. ఈప్సితార్థసిద్ధియందు స్త్రీలు కామధేనువులవంటివారు పరగృహీతలగు స్త్రీలయందు ప్రియత్వమును శత్రుత్వమును గూడఁ దలంపగాదు. కారణవశంబున నాంతరీయకముగా (వదలుటకు శక్యముకాకపోవుటచేత) తటస్థమైనచో, వేపచెక్క తిన్నట్లనుభవింపవలెను. ఋతుస్నాతయగు స్త్రీసంభోగపాత్రురాలు. ఋతుస్నాతాపరాధము మహానర్థకరము. ఋతుస్నాతాపరిత్యాగముఁ గావించినవానికిఁ బిత్రూణవిముక్తి లేదు స్త్రీదూషకుడునగును. అపకారముఁ జెందిన స్త్రీలు తాము చత్తురు లేదా పతిఁ జంపుదురు స్త్రీలు చేయుటకు వెనుదీయు కార్యమేలేదు పెండ్లియాడకుండుట మంచిదికాని పెండ్లియాడి భార్యాపరిత్యాగముఁగావించుట మంచిదికాదు. దున్నని వానికి పొలమేల. సవతినిఁ దెచ్చిపెట్టుట భర్తయయోగ్యత తిరస్కరించుట సంతానములేకపోవుట చిరవిరహము నివి స్త్రీలకు విరక్తికారణములు. స్త్రీలకు సహజంబగు గుణముగాని దోషముగాని లేదు. ఎటువంటిపతి దొఱకిన నట్టివాండ్రగుదురు. అనువాండ్రకు దాస్య మానువాండ్రే చేయుదురు. పక్షులుగూడ నితరపక్షిసంయోగమును దమయాండ్ర కంగీకరింపవు. మనుష్యులమాట చెప్పవలయునా! వంశవృద్ధికొఱకును దనర్థపరిహారముకొఱకును నాప్తలోకమునకు బాధకలుగకుండుటకును స్త్రీలు ప్రయత్నపూర్వకముగా రక్షింపఁబడుదురుగాని ఉపభోగార్థము కాదు. యథాకామముగా కామి

మల్లగు వేశ్యలను జేరఁదీయుట యనర్థములకు గారణము. మఱియు నశుభములు తె
చ్చిపెట్టుపని. దౌవారికుఁడు లేని రాజద్వారముం బ్రవేశించుట కెవ్వరు సంకోచింతు
రు. కంచమువలె వేశ్యలు సర్వసామాన్యలు. వారియందు హర్షామర్షములు పొందవలసి
న యవసరమే లేదు. రాజు పరిశుద్ధురాలగు తల్లికడుపున జన్మించినవారును నిల్లు గడప
దాటనివారును నగు స్త్రీలతో సంభోగింపవలయు. రాజునకు పరస్త్రీగృహప్రవేశము క
ప్పకు వల్మీకప్రవేశమువంటిది. రాజెంత యవసరమైనను స్త్రీగృహమునుండి తీసికొనిరా
బడిన పదార్థము తినరాదు. తా నాస్వాదించు వస్తువులు విషయమై స్త్రీలను నియోగిం
పరాదు. స్వాతంత్ర్యము వహించినస్త్రీలు చేయని దుష్కార్యములు లేవు. మణికుండల
యను పట్టమహిషి నిజరాజ్యమునం దనకు స్వాతంత్ర్యమును కోరినదై విషదూషితమగు
మద్యగండూషమిడి భర్తయగు నజరాజుం జంపె. విషమిశ్రితమగు లత్తుక యాధరంబు
నకుం బూసికొని వసంతమతి యనునది శూరసేనాధిపతిం జంపె. దశార్ణదేశములయం
దు వృకోదరి యనునది విషోపలిప్తమగు మేఖలామాణిక్యముచే మదనార్ణవు నుక్కడంచె.
వాడియంచుగల యద్దమున మదిరాక్షి యనునది మగధదేశంబున మన్మథవినోదునిం గె
డపె. చండరస పాండ్యదేశంబున కొప్పునందాచిన కత్తిచే ముండీరుని గండడంచెను.
స్త్రీలు క్రీడాసుఖములయెడల నమృతరూపము వంటివారును కల్లునూతివంటివారునుఁ గూఁ
డ నగుచున్నారు. వారిసుకృత్యదుష్కృత్యములు నిర్ణయించుట కెవ్వఁ డధికారి.
స్త్రీలకు సంతానముం బెంచుటయందును గృహకర్మలయందును శరీరసంస్కారంబందు
ను శయనావసరమందునుం దప్ప దక్కినపనులయందు స్వాతంత్ర్యమీయరాదు. స్త్రీల
యందిడిన పెత్తనము ఖడ్గమువలె భర్తల హృదయమర్మచ్ఛేదము చేయకుండ యూర
కే పోదు. స్త్రీవశుండయిన పురుషుఁడు నదీప్రవాహమధ్యపతితమగు పాదపము వంటి
వాఁడు. పురుషుని చేతిలోనున్న యాఁడుది ఖడ్గముష్టివలె కలుగఁజేయని యానందము
లేదు. పెక్కుస్త్రీసంతానముం గనరాదు. స్త్రీలకు శాస్త్రవ్యుత్పత్తి గలుపరాదు. సహజ
ముగ జన్యమైన శాస్త్రజ్ఞానము గూఁడ స్త్రీలయందును శస్త్రధారులయందును విషమించు
ను. వేశ్యాసక్తి ప్రాణమానద్రవ్యములకు హానిచేయును. వేశ్యలు ధనమనుభవింతురు
గాని మనుష్యుల ననుభవింపరు. ధనహీనుఁడగు మన్మథునందైనఁ బ్రీతి యుంచరు. వా
రికాంతులకు విస్తారము ధనమొసంగువాఁడు తుదకు దుఃఖమనుభవించును. ఎవ్వఁడు
తనధనముచే వేశ్య నర్థపతిం జేసి యా ధనమును తుట్టతుదకితరులకు ధారవోయించునో
వాఁడు పశువులకుం బశువు. అధికద్రవ్యమొసఁగి వేశ్యననుభవించువాఁడు చిరకాల
ము సుఖ మనుభవింపఁడు. అనుభవించినను దానియందు పెక్కనర్థములు గలవు. వే

శ్య యెంతకాపాడినను పరపురుషసేవనరూపమైన నిజప్రకృతి వీడదు. ధనాసక్తిచే పరపురుషులను సేవింపకమానదు. కడుపునిండినను కుక్క యెముకలను పీకకమానదు. పంచదారకలిపినపాలు పోసినను పాముకోరలయందు విషము పుట్టకమానునా? కోతికి వేయిమంది శిక్షచెప్పినను చాపల్యము పోవునా? వేము చెఱుకుపానకములో ముంచినను చేదే. దుష్టశీలురం గారవించుట సత్కుశీలురకు కోపకారణము. కోశవృద్ధి దాయాదులకు వికారము గలుగఁజేయును. శుభారంభములచే శరీరమునకు కారుణ్యముఁ దెచ్చుకోవలయుఁ గాని వేఱుతెఱంగున తెచ్చుకోఁజనదు. రాజు కొడుకునకైనను సత్కులీనునకైనను భక్తియును విశ్వాసంబును వ్యభిచారాభావంబును నేర్పవలయు. ఉచితకర్మములయందు నియోగింపవలయు. ప్రాణబాధయు బహుజనవిరోధంబును మహాపాతకంబును వచ్చుకార్యములందు దప్ప నితరకార్యములయందు బుత్రుఁడైనను రాజాజ్ఞ జవదాటరాదు. బలవత్పక్షముగల శత్రుగ్రహముకెడల నాప్తపురుషవిశ్వాసము నుంచవలయు. లేదా, గూఢక్షేపముగల దూతవలనఁ దెలియవలయు. దుర్బుద్ధిగల సుతునియందుగాని బాంధవునియందుగాని దురభినివేశము వదలవలయు. కుమారుఁడు సజ్జనసేవ్యుఁడు కానిచో నతఁడు దుష్పుత్రుడని తలఁచవలయు. క్షేత్రబీజముల వైపరీత్యము సంతానమునకు వికారము గలుగఁజేయును. కులశుద్ధియు, దంపతుల కన్యోన్యప్రీతియు మనోనైర్మల్యంబును దోషదూషితముగాని సమయంబును విద్యాలక్ష్ములను గలుగఁజేయు మంత్రముచే పరిపూతమగు పరమాన్నము భుజించుటయు నను నివి యుత్తమపురుషజన్మంబునకు కారణములు. గర్భశుభంబును జన్మకర్మంబును సంతానమునకు దేహలాభాత్మలాభములయందు కారణమగును. జాతియోగ్యంబగు సంస్కారములేనివానికి రాజ్యమందును (సన్యాస) ప్రవ్రజ్యయందును నధికారములేదు. యోగ్యుఁడైన నితరుఁడు లేనియప్పుడు పుత్రోత్పత్తివరకు వికలాంగుండు గూఁడ రాజపదమున కర్హుండు. రాజపుత్రులకు సాధుసంపాతమైన వినయము వయము నభ్యుదయమును దూషింపదు. చెదలు తినిన కఱ్ఱవలె నవినీతుండగు రాజు రాజ్య మభియోగమాత్రంబుననే భంజించుటకు శక్యమగును. ఆప్తులచేతను విద్యావృద్ధులచేతను సంస్కరింపఁబడని రాజపుత్రులు సుఖమారులు. తల్లిదండ్రుల నవమానించు రాజపుత్రుల కభిముఖములగు సంపదలుగూడ విముఖములగు. ఎవనిజన్మ దురపవాదోపహతమో వానిరాజ్యము కాల్పనా? ఏకార్యమునందును రాజపుత్రులు తండ్రియానతి మీరరాదు రాముఁడు క్రమమునందుగాని విక్రమమునందుగాని తక్కువవాఁడా? యతఁడేల తండ్రిమాటం బట్టి వనవాసము చేయవలయు. తనయిచ్చవచ్చినట్లు నడచు కొడుకునకు తండ్రియేల శత్రువగు, ఎవ్వడపా

త్రకర్మము చేయునో వాని యాత్మను వాఁడే చంపుకొనుచున్నాడు. తండ్రియందు రాజ్యభారమున్న రాజపుత్రులే ధన్యులు. సుఖము కలుగఁజేయని సంపద యెందుకు. అధికవ్యాసంగము వందలకొలఁది దుఃఖములను కలిగించును. అఫలారంభము లెవ్వనికి సుఖావహములు? లాతివారి పొలము దున్నిన ఫలమేమి. దానిపంటకు క్షేత్రాధికారియే యధికారిగదా? కొడుకులు, తమ్ములు, సవతితమ్ములు, పినతండ్రులు, జ్ఞాతులు, దౌహిత్రులు, నాగంతుకులు, వీరియందు దాయప్రాప్తియెడల నొక్కరికంటె నొకరు తక్కువవారు. ఎండిపోయిన మొగము, నల్లని మొగము, పలువిధములగు వాక్కులు, మిగుల చెమటపట్టుట, మాటిమాటి కావలించుట, శరీరకంపము తొట్రుపాటు. వాహ్యాప్రేక్షణము, ఆవేగము, పరిభూమినివాసము, ననునివి దుష్కృతము చేసిన రాజునకును చేయుచున్న రాజునకును చేయఁబోవు రాజునకును లక్షణములు.

## 25 దివసానుష్ఠానసముద్దేశము.

బ్రహ్మముహూర్తమున లేచి చేయఁదగినకార్యము లాలోచింపవలయును. సుఖనిద్రచే సుప్రసన్నమగు మనంబున యాదార్థములగు సర్వబుద్ధులును బ్రతిఫలించును. ఉదయసంధియు సాయంసంధియు ధర్మకార్యాలోచనతోఁ గడపవలయు. ఉదయమున లేచినవెంటనే తన మొగము నాజ్యమందుంగాని యద్దమందుంగాని చూచుకొనవలయును లేచినవెంటనే నపుంసకుని వికలాంగుని రజస్వలాంగనను గనరాదు. సంధ్యాకాలములయందు శుచియై జపించువానిని దేవతలనుగ్రహింతురు, నియతముగా దంతధావనముఁ జేసికొనినంగాని ముఖశుద్ధికాదు, శారీరకకృత్యములకంటె నితరకార్యవ్యాసంగ మెక్కువది కాదు. వేయియుగములు కాచుకొనియున్నను తరంగములులేని సాగరమున స్నానము దొరకునా! వ్యాయామనిద్రాస్నానభోజన స్వచ్ఛందవృత్తి కాలములను నితరకార్యవ్యాసంగంబునఁ నతిక్రమింపరాదు. శుక్రమును మలమూత్రములను నిశ్వాసమును బ్రతిబంధించుటవలన నశ్మరీభగంధరాది రోగములు తటస్థించును గంధలేశమేనియు లేకుండునట్లుగా మృత్తికచే శౌచవిధి చేయవలయును బహిర్దేశమునకుం బోయినవెనుక నాచమనముఁ జేయకుండ గృహప్రవేశముఁ జేయరాదు, దేహమునకు వ్యాయామము రసాయనకల్పమైనది. క్షయరోగికి నజీర్ణరోగికి వాతరోగికి నధికభోజికిని వ్యాయామము పనికిరాదు శరీరాయాసకారియగు క్రియకు వ్యాయామమని పేరు దేహమునకుఁ జెమ్మటపట్టు పర్యంతము వ్యాయామముఁ జేయవలయునని శుక్రాచార్యులు చెప్పిరి. శాస్త్రవాహనాభ్యాసంబున వ్యాయామము సఫలముఁ జేయవలయును తనబలము నతి

క్రమించిన వ్యాయామమువలన సర్వాపదలు జనించును, వ్యాయామము చేయనివారికి జ
ఠరాగ్ని దీపనముగాని యుత్సాహముఁగాని దేహదార్ఢ్యముగాని కలుగదు. ఇంద్రియా
త్మ మనస్సులకు సూక్ష్మావస్థయె నిద్ర నాఁబడు, సుఖనిద్రఁ జెందినవారికింద్రియములు సు
ప్రసన్నములగు, పగలు పదియవభాగంబున నిత్యము స్నానమాచరింపవలయును ధర్మా
ర్థకామములయందు శుద్ధిలేనివారినిఁగాని దుర్జనులంగాని స్పృశించినచోఁ దప్పక స్నాన
మాచరింపవలయు. శ్రమ చెమ్మట మాంద్యము నివిపోవుటయే స్నానమునకు ఫలము. దేవ
గురు ధర్మోపాసనములులేనిస్నానము జలచరస్నానము వంటిది. ఆకలియుఁ దప్పియుఁ
గొన్నతఱి నభ్యంగస్నానముఁ జేయరాదు. ఆతపతప్తుని జలావగాహనము మాంద్యంబు
ను దలనొప్పియు ఘటించును. ఆకలియగు తఱియే భోజనకాలము. ఆకలిలేనితఱిఁ దిన్న
యమృతము విషమగు, జఠరాగ్నిను వజ్రాగ్నముఁగావించువానికి జీర్ణదోషముండదు.
అన్నముఁదినక ద్రవద్రవ్యముపయోగించువారి జఠరాగ్ని నశించును. ఒక్కసారి యె
క్కువనీరు ద్రాగువారికిని జఠరాగ్ని నిలువదు ఆకొన్నతఱిని దినకున్న నన్నద్వేషమును
దేహపరిశ్రమంబును గలుగును ప్రదీప్తమగు నగ్నియందేది యింధనము కాదు ఎవఁడుమిత
భోక్త కాఁడో వాఁడు సర్వాపదలు భుజించును. విరుద్ధమైనదియుఁ బరీక్షింపఁబడనిది
యుఁ జక్కఁగా నుడకనిదియు రుచిగానిదియు నగునన్నము తినరాదు అకాలమందును
దినరాదు. అల్పభోక్తను ననుకూలుని నాకలిఁగొన్నవానిని నతిథిని భోజనకాలము
న దగ్గరనుంచుకొనరాదు. పంక్తియందున్నవారందఱితో సమానముగ భుజింపవలయు
ను గాని వెనుకఁబడరాదు. సాయంకాలమున కాకలిగాకుండ ద్వివారభోజియు మరు
నాటియుదయమున కాకలిగాకుండ నేకవారభోజియు భుజింపరాదు. అంతియేకాని
భుక్తిపరిమాణము విషయమయి యింతయని సిద్ధాంతములేదు. ఎంతజీర్ణమగునో యం
తయే భుజింపనగు. అపరిమితభోజి దేహమునకును జఠరాగ్నికిని నాపదఁ దెచ్చి పెట్టుకొ
నును. దీప్తమగు నగ్నికిం దగినంత భుజింపకుంటయు ననారోగ్యకారణమే! అతిభోజి
కన్న పరిణామము దుస్తరము. శ్రమార్తునకు భోజనంబును పానంబును జ్వరము దెచ్చు
ను. పానీయమునకుం దగినంత వెలితిగా భుజింపఁదగు. భుజించినవెంటనే వ్యాయామ
ము గాని మైథునము గాని సద్యోమృతికిఁ గారణములు, అలవాటయినచో విషముకైత
ము పథ్యమగును. అలవాటులేకపోయినను పథ్యవస్తువుం దినవచ్చుంగాని యభ్యస్తమైన
ను నపథ్యముఁదినరాదు. బలవంతునకు సర్వము పథ్యమేయని తలఁచి కాలకూటముఁ ది
నరాదు ఎంతశిక్షితమైనను నభ్యస్తమైనను నొకానొకసమయంబున విషము చంపఁగల
దు. అనభ్యస్తమైనను నమృతమన్నఁ జంపదు. ఆగంతులకు నతిథులకును నాశ్రితు

లకును విభజించి యిచ్చి తక్కినయది మెసఁగవలయు. దేవుని గురువును ధర్మంబును
సేవించువాఁడు కుటిలమతి గాఁడు. మనోనిరోధము సర్వేంద్రియములను బంధింపఁ జేయు
ను. పురుషులకు స్వతంత్రవృత్తి పరమసాధనము. స్వచ్ఛందచారులగు నేనుఁగులు కానన
ములందే రోగమును లేకుండ జీవించుచున్నవి కదా! సరసమగు స్వేచ్ఛాలాపమొకటి
యుఁ దాంబూలభక్షణమొకటియు నీరీతి సర్వకాలము సేవించుచున్నను సుఖముఁ
గలుగఁజేయునవి. చిరకాల మొత్తగు ప్రదేశమున నిలుచున్నచో రక్తము ప్రవహించు
నాడులు శిథిలములగును. చిరకాలము కూర్చున్నచో జఠరాగ్ని మందమగును. మనసు
స్థూలమగును. వాక్కు ముద్దయగును. శరీరమునకు బొంద పెరుగును. శరీరమునకు విస్తా
రముగాఁ జెమ్మటపట్టించినచో శీఘ్రకాలములోనే ముదిమివచ్చును. దేవగేహముల
ను దేవశూన్యములం జేయరాదు. దేవుఁడు గురుఁడు ధర్మువు లేనివానియందుఁ బ్రీత్య
యుంచరాదు. క్లేశకర్మవిపాకాశయపరామృష్టుఁడు కాని పురుషవిశేషమే దేవుఁడు,
అర్హన్, అజః, అనంతః, శంభుః, బుద్ధః, తమోంతక యను విశేషనామములా దేవునికే
కలవు. ఆత్మసుఖమున కవరోధము కలుగకుండ రేఁబవళ్ళు విభజించి సర్వకార్యములు
నెరవేర్చుకొనుచుండవలెను. ఏకార్యమునకును గాలనియమము లేకుండరాదు. కాలని
యమములేని కార్యము మరణసమానము. ఆత్యంతిక కార్యములకుఁ గాలనియమము పనికి
రాదు. అవశ్యకర్తవ్యమగు కార్యమునకుఁ గాలయాపన చేయరాదు. రా జాత్మరక్షణ
మునందెన్నఁడు నేమఱియుండరాదు ప్రతిదినము సవత్సయగు ధేనువునకుం బ్రదక్షిణము
జేయకుండ ధర్మాసనమెక్కరాదు. అధికారి గానివాఁడుగాని పిలువఁబడనివాఁడుగా
ని రాజసభకుఁ బోరాదు. ఆరాధనీయుఁడగు వానినెదురుగాఁబోయి నమస్కరింపవల
యు. దేవగురు ధర్మకార్యములు స్వయముగాఁ జేయవలయు. కుహకులతోడను నాస్తి
కులతోడ సావాసము చేయరాదు. విలాసకొఱకేనియుఁ బ్రాణులకుఁ దాపకరం
బగు పనిచేయరాదు. తల్లియైనను బరస్త్రీతో రహఃప్రదేశమందుండరాదు. ఎంతకోప
మువచ్చినను మాన్యుల నవమానింపరాదు. వారిమాట నతిక్రమింపరాదు. శోధింపకుండఁ
బరస్థానమునఁ బ్రవేశింపరాదు. కూర్చుండరాదు. ప్రత్యక్షప్రమాణముచే నాక్రమింపని
వాహనాదిక మెక్కరాదు. మంచిగాఁ బరీక్షింపకుండఁ దీర్థమునుగాని ఫలమునుగాని స
న్యాసినిగాని నమ్మరాదు. హితకాంక్షిచేఁ బరిశోధింపఁబడని మార్గమునం జనరా
దు. విషనాశకంబగు మణినిగాని యోషధింగాని సేవింపరాదు. విషవైద్యుని విశ్వాసెన్న
డును గరంమునం దాల్పరాదు. మంత్రియు వైద్యుండును జ్యోతిష్కుఁడును లేకుండ
నెన్నడును గొలువుచేయరాదు. తానుపయోగించు ప్రతిపదార్థమ్మును పరీక్షించు

ను నన్యసుఖునందును బరీక్షించి భుజింపవలయు. తాను చేయు సర్వకార్యంబులను న
మ్మతయోగంబునఁ జేయువలయు. అంతఃపురినిఁ దనతో సమానముగాఁ జూచుకొన్నచో
నెవరికిని శ్రేష్ఠ్యుఁడు కాఁడు. పరిజనము దినము శకునము వాయువు నివి వ్యతిరేకముగా
లేకుండుటయే భావికార్యసిద్ధిని సూచించును. రాత్రిగాని పవలుగాని యొక్కఁడును సం
చరింపరాదు మతోపాస్యకర్మంబులను నియమముగాఁ జరుపవలయు. నక్షత్రద
ర్శనపర్యంతము సంధ్యోపాసన చేయువలయును. తరువాత సముద్రములే స్తనములును ధ
ర్మమె మూపయు నుత్సాహమె తోకయు వర్ణాశ్రమంబులే ఖురంబులును నయప్ర
తాపంబులే కొమ్ములును సత్యజ్ఞానంబులె కన్నులునుగాఁ గలిగి న్యాయమార్గాభిముఖియు
గు నీభూమిధేనువును నేను పాలించుచున్నాఁడ. ఎవ్వఁడు దీనికి పరాభవము గా
వించునో వానిని నేను బరిశీలించుచున్నాఁడ సహింపను. అను నీమంత్రము మనుసమా
ధియందుండి కొంతకాలము జపింపవలయును.

పురుషసంగము నపేక్షించు కాంతతో సంగమింపరాదు. ప్రథమప్రకృతిగలస్త్రీ
ల కనురాగము రహస్యము. ప్రవర్ణవంతమగు కేశము ముఖ్యము. ద్వితీయప్రకృతిగ
లవారికి మృదువవనంబును నశాన్వలంబునగు ప్రదేశము కామ్యము. తృతీయప్రకృతిగ
లవారికి సురతోత్సవమే ప్రధానము స్త్రీపురుషులకు సమయోగముకంటె వేఱ వశీకరణ
మంత్రములు లేవు. సమయోగమనఁగా నొకరీతిప్రకృతియు నొక్కరీతి యుపదేశఁబు
ను నొకరీతి వైదగ్ధ్యంబును నొక్కరీతి స్వాభావికధర్మంబులును గలుగుటయే. ఆకారఁ
గొన్నవానితోడను దప్పికగలవానితోడను బుభుక్షివిమోచనాకాంక్షితోడను నాస్తిని
తోడను సంగమించిన నిష్టమగు సంతానమును బడయఁడు. సంధ్యాకాలంబునందును ప
గటియందును దేవాగారములయందును నుదకములయందును మైథునముఁ జేయరాదు ప
ర్వసంధులయందును గ్రహణగిరిసంబంధమగు కులస్త్రీలతో రమింపరాదు. యీవిధికప
వాదశాస్త్రములేదు. రాజు పరస్త్రీయింటను గొంతున్నఁదను దాసితోఁ బుండరాదు. వంశ
మునకుఁ బ్రాయమునకును వృత్తమునకు విద్యకును విభవమునకును దగిన వేషంబును స
మాచారంబును నెవరి గుర్తింపఁ జేయుడు. ఒకిక్క చేయకుండఁగను బరిశోధింపకుండఁగను రా
జకులమునందు ప్రవేశించువస్తువును బరిశోధింపక దేశవస్తువును బయటికిఁ దీసికొనిపోరాదు. కుంతలాధిప
తి దూతవేషధారియై పల్లవనరేంద్రుం జంపినట్లును వత్సపతి విమర్దమగు మేకకొమ్ము
చేతఁ గళశఫలాధిపతిని జంపినట్లును వినుచున్నారము. అవిశ్వస్తులయందుండు నే
శ్రీయు సిద్ధింపదు.

## 26 (సదాచారసముద్దేశము.)

అతిలోభ మతివిశ్వాస మత్యనుగ్రహము సీమూటిచేతను బృహస్పతియంతవాడై ని వంచింపఁబడును. జంపఁబడును. బలవంతునితో విరోధపడినవాడు దేశాంతరమునకు లేచిపోవలయు లేదా వానితో సంధిఁగావించుకొనవలయునె కాని యన్యథా క్షేమోపాయము లేదు. దేశాంతరమునకు లేచిపోయినవానికిఁ బౌరుషమెక్కడిది? తనస్వరూపము తెలియకుండ సంచరించినచో వాఁడు గొప్పవాడైనను దక్కువవాఁడే. ఆర్తులకు ధర్మబుద్ధి మెండుగనుండును. ఎవ్వఁడు స్వయముగా ధర్మమందు (బ్ర)వర్తించునో వాడు నిరోగుండు. వ్యాధిగ్రస్తునకు ధైర్యమునకంటె నెక్కువమందులేదు. ఎవ్వని జన్మము దుర్జనావల పాలుగాదో వాఁడు మహాప్రాణి. మందమతులు పరాధీనంబులగు వస్తువులందు స్వోత్కర్ష వెలిఁబుచ్చుకొనుచుందురు. భయసమయంబులం దేడువక ధైర్యమవలంబింపవలయు. రణమునందును శరసంధానంబునందును మోహపడు నతఁడేటి ధానుష్కుఁడు. మరణమునందును మనస్సంధానమందు మోహపడు నతఁడేటి తపస్వి. కృతికి బ్రతికృతి చేయనిచో నైహికాముష్మిక ఫలంబులు రెండునులేవు. శత్రువులవలననైనను మంచిమాట గ్రహింపనగు. కలహకారిత్వమున బ్రీతి చెడఁదీయుటయు దుర్మతుల ధర్మము కాని సజ్జన ధర్మము కాదు. ఎవఁడు లబ్ధమగు సంపదచేతనే సంతసించి మరలఁ దద్విషయకప్రయత్నముఁ గావింపఁడో వానికి సిరి యభిముఖి కాదు. వైరానుబంధ మెవ్వఁడుపశమింపఁజేయఁడో వానికి వంశవృద్ధి యెట్లగు. భీతుల కభయదానము కన్నఁ బరమమగు దానములేదు. ఉత్సాహము కామితార్థములను వెతుకుచుండును. అందఱికిని కల్పవృక్ష ప్రాయుఁడగు ప్రభువు తనయెడల వంధ్యుఁడగుటకుఁ గారణము తన దురదృష్టమో తన యపరాధమో యని తలంపవలె. ఎవఁడు మూలధనమును వృద్ధిపఱుపకుండ ననుభవించునో వాఁడత్యంత దుఃఖితుఁడగును. మూర్ఖదుర్జన పతితులతోడి సహవాసమెవ్వనికిని శ్రేయస్కరము కాదు. హారిద్రారాగమువలె నెవ్వని చిత్తానురాగము వ్యాపింపదో వాని సంతోషమితరులకు ఫలకారి కాదు. తన కొలఁది యెఱుంగకుండఁ బరాక్రమించినచో నెవ్వఁడు పరాభవముఁ జెందకుండు. పరాభియోగమునకు శాంతియెన్నఁడును బ్రతిక్రియ కాదు. ప్రత్యుపన్యాసమే ప్రతిక్రియ కాని అసమయకోప మెంతవిశ్వాసమున్నను పరిజనమునకు వైరస్యము కలుఁగఁజేయును. చచ్చినవానివిషయమయి యేడ్వఁజనదు. వానికిం దగిన యుత్తరక్రియలు జరుపఁదగు. అట్లు చేయక యేడ్చినచో కన్నీటి బిందువులె ప్రేతల వ్యసనంబుల కంగారంబులగు. నట్లేడ్చినచో వాడు

మరల బ్రతికి లేని దుఃఖింపవచ్చును. చిరకాలము శోకము హృదయమునం జేర్చుకొన్న చో నది ధర్మార్థ కామముల కుచ్ఛేదన చెప్పును. కామనిద్రుఁడయ్యు నెవ్వఁడు విషయములం దభిలాష విడనో వాఁడు కింపురుషుఁడు. అపరిచితులయెడఁ బ్రియపూర్వ కానురాగముఁ గన్పఱచువారు దేవసమానులు. ఈలోకమున్నన శాశ్వతమగు కీర్తి సంపాదించినవారు మృతులయ్యును మృతులుకారు. ఎవని కీర్తి చేత భువనంబులు ధవళీకృతంబులు కావో వాఁడు భూభారమునకై జన్మించినవాఁడు. పరోపకార పారీణులకు శరణాగతులయెడఁ బరీక్ష పనదు. అభిచారకిృయల వలనఁ బరాభిభూతి చేయుట మహాపాతకి లక్షణము. ఏరాజునకు విద్వాంసులయందుఁ గాని విద్యార్థులయందుఁ గాని గుణగ్రహణ పారిగల్భ్యముండదో వానికి విజయంబును నభ్యుదయంబును నెట్లు సిద్ధించును. పరోపద్రవంబులు నష్టంబులు చేయుబ్రియుండుట నుండదో తనకుటుంబము నామిత్రులయుంట సంరక్షింపవలయును. పరస్త్రీ పరద్రవ్యముల రక్షించుట వలన లాభమురేమగాని వానికేదేని నష్టమువచ్చినచో గొప్ప యనర్థము మాత్రము గలదు. ఆత్మీయురక్తునిఁ బరిత్యజింపరాదు. తనకున్నంతయే వానికిచ్చి సంతోషపఱుప వలయును. ఆత్మశ్లాఘయుఁ బరనిందయు గల భృత్యుఁడున్నచో నెంతపనివారమున్న రాజైనను గొలది కాలములో నేకాకియగును. అపరాధమునకు తగినదండము స్వపుత్రులయెడలనైనను చేయవలయును. పన్ను దేశమునకుఁ దగినట్లు గ్రహింపవలయును. ప్రతిపత్తికిఁ దగినట్లు మాటాడవలయును. ఆదాయమునకుఁ దగినట్లు వ్యయము చేయవలయును. ఐశ్వర్యముకూడకుఁగా విలాసము జూపింపరాదు. వహోదయానుకూలముగాఁ గార్యమారంభింపఁదగు. ధనమునకును శ్రేష్ఠమును దగిన త్యాగమొనరింపఁవలెను. సంతోషియే సుఖి. రజస్వలాసంగమము చేయువాఁడు ఛండాలునికంటె నధముఁడు. సిగ్గుపడఁదగు కర్మము లజ్జాశూన్యముగాఁ జేయరాదు. ఎవనికి సచ్చరిత్రయే యాభరణమై యుండదో వాఁడు దివ్యాంబరధారి యయ్యును దిగంబరుఁడే. సత్పాత్రదాతృఁడు దిగంబరుఁడయ్యు దివ్యాంబరధారియే. ప్రతివాదసందేహముకలవానికిఁ గార్యసిద్ధి కాదు. మృతద్రవ్యములకంటె నధికమగు దరిద్రమునకు లేదు. నిర్భాగ్యులకు పరోపకారమే వృత్తి. పరాధీనమగు భోజనముకన్న నుపవాసము మేలు. వర్ణసంకరము లేని దేశమందు నివసింపవలెను. ఎవఁడు పరలోకమును బరిగణింపఁడో వాఁడు పుట్టంధుండు. ప్రతము విద్యయు సత్యంబును వాక్శరణ్యంబును నశోభవాక్యంబులును దారిద్ర్యమును నిలుపునఁ గాని దారిద్ర్యమును బ్రాహ్మణవంశభవత్వము నిలుపదు. నిస్పృహులకుఁ బరాపేక్షయేటికి. ఆశాక్లేశ మనుభవించువాఁడే పురుషుఁడా! ఎవనిచిత్తము శాంతమగునకాదో వాఁడెట్లు సుఖించును. ఎవనిచి

త్రమజ్ఞానోపహతము కాదో యతఁడే సంయమి. పురుషునకు శీలమలంకారముకాని శరీరమునకు బలువగు నగలును జెమ్మటపుట్టఁజేయు నంబరములను నలంకారములు కావు. ఆపకారముఁజేయువాని కుపకారము చేయుటయే చంపుట. నిర్ధనులకుపకారము చేయనివాఁడు పురుషుఁడు కాఁడు. యాచకులకుపయోగింపని సంపద మరుభూమివంటిది. రాజునకుఁ బ్రజాపరిపాలనమే యజ్ఞము కాని పశుహింస కాదు. రాజునకున్న బలమును ధనస్సును నిరపరాధి శిక్షణమునకై కాక శరణాగతరక్షణమునకై యుపయోగింపనగు.

## 27 వ్యవహారసముద్దేశము.

మనుజునకుఁ గళత్రమనఁగా స్వరూపమున నినుపసంకెలి కాకున్నను దానికంటె గాఢమగు బంధనము, తల్లి, భార్య, సంతానము, ఈనలుగురును ప్రతిపురుషుఁడునుఁ బోషింపఁదగినవారు. పోషకులు లేక తగినవయస్సు రాక క్లేశపడు నితరసంతానముఁగూడ శక్తికొలఁది పోషించుట గృహస్థునకు విధి. దానముగాని తపముగాని ప్రాయోపవేశనముగాని తీర్థోపాసనకు ఫలము. తీర్థోపవాసులకు దేవతాద్రవ్యమపహరింపకుండుట. రాక్షసులకుఁ గామ్యమువంటిదియు దురాచారులకుఁ బాపభీతత్వము వంటిదియు నసంభవము. ధర్మరాహిత్యమతినైష్ఠుర్యమతివంచకత్వమును తీర్థవాసులకుండు సహజధర్మములు. ఏరాజు తగినసమయమునఁ బ్రభువుల సన్మానింపఁడో యతఁడు కుత్సితప్రభువు. చతురంగసంకోచము చేయువాఁడును సమయమునువచ్చినప్పుడు ధనముదుగువాఁడును కుత్సితభటుఁడు. అట్టిమిత్రుండును గుత్సితుఁడే. ధనమువలనఁ బ్రేమచూపించు కామిని కుత్సితురాలు. తనకు సుఖకరము గాని దేశమును వ్యసనకాలములందనుసరింపని బంధువును నత్యాదరశూన్యంబగు మిత్రుండును నతిథులకు బెట్టకుండఁ దిను భోజనమును సమయమునకు తనకుపయోగింపఁబడని స్త్రీయుఁ జెప్పకొనఁదగనిదియు దాఁటదగునగు నాచారమును ధనసంపాదనయు వినయంబును లేని పుత్రుండును, చిత్తంబునందలి మదాంధత్వము విడువని జ్ఞానంబును, పరోక్షమందు నిందించు సౌజన్యంబును సత్పురుషుల కనంతోషమిడని సంపదయు, దప్పిపోవు నుపకారంబును గుత్సితంబులు. ఇరువురును నధికాభిమానులయినను బండితంమనుష్యులైనను మూర్ఖులైనను లుబ్ధులైనను నసహాయము కలవారైనను వారికిస్నేహము కుదరదు. ఎక్కడ దానియందుంబలె స్వదత్తద్రవ్యమందు మరల నభిలాషపడరాదు. అభిజాతులుపకారమునట్టి మరల దానిస్మరించుటకు మూగవారు సత్పురుషులు పరదోషములు వినుటకుఁ జెవిటివారు. అదృష్టవంతులు పరకళత్ర

ములం జూచుటకు గ్రుడ్డివారు. శత్రువైనను నింటికివచ్చినచో సత్కరింపవలయునన్న చో నీతులవిషయమయి చెప్పవలయునా!

తనయింటం దాచుకొన్న ధననిక్షేపమునుం బోలెం దన చేసిన ధర్మమును దాను ప్రకటింపరాదు. మదప్రమాదముల వలనం జేసిన దోషమునకు గురువులకు దెలిపిన పిదప నే ప్రాయశ్చిత్తము. దేవగురు ద్విజాతిథులను శ్రీమంతులు కాయక్లేశపడి సత్కరింపంజన దు. విభవానుసారముగ సత్కరింపజేసినం జాలును. నీచుల కున్నతమధ్య లాలన మొనరించినను తేంగీలకుం బలె వికార మొనరింపకుండుట తటస్థింపదు. ప్రత్యుపకారాపేక్ష లేకుండ నెవ్వం డితరుల కుపకారమొనరించునో యతండు ధన్యుండు, తెలివిలేనివాని వైరాగ్యంబును సన్యాసివిటత్వంబును ఇంద్రియపాటవము లేని విలాసమును వేశ్యారతుని సదాచారంబును తెలిసికొనదగిన వస్తువును తెలిసికొనలేనివాని తత్వవిచారంబును మహాత్ములకు శ్రీరళ్యాలక్షణంబులు, శస్త్రము లేనివానితోడను శాస్త్రము లేనివానితోడను నెవడెడరించునో వాండు మహాపాతకి. ఘృతమువినుటకుం జండాలగృహంబునకు బోయినట్లే యొక్కొకప్పుడు కార్యసిద్ధికై నీచులను సైతమాశ్రయింపవలెను. కార్యార్థి పరదోషము పరిగణింపడు. గృహదాసీసంగమము గృహమును గృహిణిని గృహపతినిం గూడ నశింపంజేయునది. వేశ్యాపరిగ్రహము దేవద్విజ బాంధవుల కుచ్చాటనమంత్రము, ఔరా లోకుల పాపము. తనభార్య రతీదేవి వంటిదయినను గిట్టకున్నది. పరకీయ కుబ్జవంటిదైనను రంభయగుచున్నది. ఒక్కదానిని పెండ్లాడినవాడే సుఖి. స్త్రీవ్యసనికైనను, నభిసారికల యందున్నంతసుఖము వేశ్యల యందు లేదు. వేశ్యలయందలి వ్యసనమున ధనమా! పోవును ధైర్యమా! తట్టించును దాని యిచ్చవచ్చినట్లు తిరుగటా సంప్రాప్తమగును, అస్తరణము, కంచి ఆవు, గాడిద, పెండ్లి కూడిన పెండ్లము. ఏపనిం జెప్పినను వెనుదీయక సేయు పరిచారకుండును నెవ్వనికి సుఖము సేయును. యతి నృపతి వేశ్య! చారుండు భాండసుండు వీరింటికి వచ్చుట నష్టమునకే గాని లాభమునకు గాదు. లుబ్ధునకెన్ని సుగుణము లున్నను వ్యర్థములు. ఫలింపని యాచ్నాదైన్య మెందులకు. దారిద్ర్యముకంటె లాఘవకారి లేదు. దానివలన మహత్త్వముగూడ శంకనీయ మగుచున్నది. వినయభిలపితము నెరవేర్చుకున్నమ ధనవంతునిం గుణించి లోకము సంతోషించుచుండు, రత్నహిరణ్య పూతమగు జలముకంటె శుద్ధిచేయు పదార్థము లేదు. బందీమోచనము దీనపరిపాలనము కలయుత్సవమే యుత్సవము. అతిథులకును బరిజనులకును మృష్టాన్నమిడిన దినములే పండుగ దినములు. అధర్మకార్యములు సేయక ధర్మకార్యములు చేసిన తిథులే తిథులు. అకృత్యములు చేయని తీర్థయాత్రయే తీర్థయాత్ర వయోవిద్యోచితమగు సమాస్థానము సేయించు

పాండిత్యమే పాండిత్యము. ఇతరులకు నొప్పితగులకుండఁ దనకార్యమును నెఱవేర్పఁజా లు నేర్పే నేర్పు. సర్వజనసమ్మతంబగు లౌకికజ్ఞానమే లౌకికజ్ఞానము. పరుషోక్తియుఁ బరోద్వేగంబును లేని వాచాలత్వమే వాచాలత్వము. యౌవనదోషంబున నపవాదమంటని ధైర్యమే ధైర్యము. అదానము పరవశీకరణముగల సౌభాగ్యమే సౌభాగ్యము. విద్వాంసులులేనిసభ మహారణ్యముగాని సభ కాదు లోకమంచెప్పనికి నిష్టముగానిదియ ష్టమెంచునుకు. పరసంబంధము సహింపనిరాజు మూర్ఖుఁడు. వ్రాఁతకంటె మాట ప్రమాణమైనది కాదు. తెలియని వారియందు విశ్వాసముంచఁజనదు. స్వామిద్రోహము, స్త్రీహత్య శిశుహత్య, యనుమూఁడు మహాపాతకములకు ఫలము తత్కాలమునందే సంభవించును. దుర్బలునకుఁ బలవంతునితో విగ్రహము తెప్పలేకుండ సముద్రములో దిగుటవంటిది. బలవంతునియొద్ద వికృతిసేయుటకంటె మరణ కారణము లేదు. ప్రవాసము చరిపర్తులకేని సంతాపకరము. చాలవారి బత్తెము. మతికనుకూలమగు పరిజనము వారియు సువిహితంబులు సాధనంబు కలప్రవాసి విదేశంబులందెంత మాత్రము దుఃఖపడఁడు.

## 28 వివాదసముద్దేశము.

రాజు గుణదోషములకుఁ ద్రాసుకర్రవంటివాఁడు. సమస్తజనులకును గుణదోషములే గౌరవమును లాఘవమును దెచ్చునవి. రాజధికారులయెడల సమపక్షపాతులైనవో సత్ఫలమనుభవింతురు అసత్యునింతె యథావస్థితమగు నర్థమును ప్రకటించువారు సభ్యులు. వ్యవహారముఁజూడనివారును వినినవారును బ్రత్యర్థులను లంచమును నపేక్షించువారును సభ్యులు కాఁజనదు. లోభపక్షపాతములవలన యథార్థమును మఱుగుపఱచు సభ్యులును సభాపతియును మానహానియు ద్రవ్యహానియు నొందుదురు. సభాపతి తనకు శత్రువగువాని కథనమే పనికిరాదు సభ్యులకును సభాపతికిని తిన్నని బుద్ధిలేనిచో జయమెట్లు ఘటించును. వివాదమునరించి సభకురకుండుట పిలిపించినఁ బోఁపోవుట మొదటిమాట తరువాతిమాటను బాధించుట పరోక్తులకు నిరుత్తరుండగుట యుక్తియుక్తమగు మాట నంగీకరింపకుండుట స్వదోషమును గప్పిపుచ్చుట పరునిదోషములుదాహరించుట యథార్థవాదమందు నుపేక్షించుట మొదలగునవి సభాపతిపరాజితులకుఁ జిహ్నములు. సాక్ష్యముకంటె భుక్తము. పత్రముకంటె సాక్ష్యమును బ్రబలమైనది. భుక్తమనగా ద్వాదశసంవత్సరపరిమితము. ఆక్షేపముగల భుక్తంబును నష్టసాక్ష్యమును కూటలిఖితమగు పత్రంబును వివాదము తీర్చుటకుఁ జాలవు బలాత్కారముగను నన్యాయముగను రాజులనను జేసిన ప్రమాణము కాదు. వేశ్యయుఁ గితవుం

దును. చెప్పినసాక్ష్యము గ్రంథానుసారముగను గ్రామానుసారముగను బరికించి నమ్మద
లయును. అసత్యరూపమగు వ్యవహారమునకు విచారణమె యనవసరము. ధనన్యాసవిష
యకమగు వివాదము పురుషునియందలి ప్రామాణ్యము ననుసరించి నిర్ణయింపవలెను.
లేదేని దివ్యప్రమాణవచనముల నిర్ణయింపఁదగు. గ్రామమర్యాదలు లేనిసాక్షి దివ్య
ప్రమాణవచనములును నమ్మరాదు. వాదిప్రతివాదులుభయులకును నమ్మకుఁడగు సా
క్షి ప్రమాణవాక్యములు నమ్మవచ్చును. విటులయు లింగులయు నాస్తికులయు దురాచా
రులయు దైలికప్రమాణవాక్యములు నమ్మరాదు. వారిసాక్ష్యము కార్యసిద్ధికిఁ గార్య
సిద్ధికిని గూడఁ బనికిరాదు. పత్రోక్తులును ముఖోక్తులునుఁ బరిశీలించి తీర్పుచెప్పవ
లెను. పరవిప్రలాపమున్నచో యుగాంతరములకైనను వివాదసమాప్తి కాదు. సభలోఁ
భూమిపైఁ గూర్చుండరాదు. సాక్షులన్యోన్యము మాటలాడుకోరాదు. జానపద పౌ
రవ్యవహారముల యెడల వివాదము కలిగిన రాజావలననే తీర్పుఁజేయవలెను. రాజపరిశీ
లితమగు దానియందు దోషముండదు. రాజశాసనమును రాజమర్యాదను నతిక్రమించిన
వానికి సర్వస్వాల ఫలంబగు దండనము విధింపవలెను. దుర్మార్గులకు దండనేతరమగు
నివారణోపాయములేదు. కట్టెవంకర పొయ్యియె తీర్చును. దరిద్రునెల్లరును బరా
భవింతురు. సరళమగు దారువు చీల్పఁబడినట్లు వక్రదారువు చీల్పఁబడదు. అపరాధు
లను క్షమించుట సమర్థునకుఁ దప్పు కాదు కాని తన్నెదిరించినవానిని క్షమించుట యన
ర్థకృపమనిపించుకొనును. దుష్టపాండిత్యముగల రాజులఁజూచిఁ బాములఁజూచినట్లు జ
నులు భయపడుదురు. బహునాయకము ననాయకమును నగుసభఁ జొరరాదు. పరప్ర
వేశములగల గోష్ఠి తలఁపరాదు. స్వనిందా పరిహార మాత్రమే సజ్జనులకుఁ బరనింద. ప్ర
తివధా ముఖంబునను రాజస్తుతి యనవసరము

అర్థసంబంధము గాని దుస్సహవాసము గాని కలహము గాని యాకస్మికార్థలాభ
ము గాని ప్రాణములతో పాటుసంపాదించిన పూర్వార్జిత ద్రవ్యమునుగూడ నశింపఁజే
యును. బ్రాహ్మణులు హిరణ్యము గాని జన్నిదము గా స్పృశించియు క్షత్రియులు
శస్త్రములను గాని, రత్నములను గాని, భూమిలను కాని, వాహనములను గాని, జీనులను గా
ని, స్పృశించియు. గోమట్లు ధనగోపన స్థానమును గాని, బిల్లవానిం గాని, కాకిణి హి
రణ్యములను గాని, మట్టియు కూన్రిలు పాలు గాని, విత్తులు గాని. పుట్టలు గాని, కాకి
యు శిల్పులెవ్వరే క్రియవలన జీవింతురో తత్క్రియా సాధనములను స్పృశించియు
యత్యుల్లిష్ట దేవతాపాదములు స్పృశించియుఁ జేసినశపథము దివ్యశపథ మనఁబడును.
కోశము తంతులములను తులాదండములను స్పృశించి చేయు శపథంబు దివ్యంబునాఁ

బడు. ఆర్యులచే తడితోలుమీఁద నెక్కించి శపథముఁ జేయింపవలెను. కిరాతుల
చే వింటిబద్దను దాటించుటయే ద్రావిడ ప్రమాణము, ఉంచుకొన్న లంజె సానియు గోప
శీలుండగు పరిచారకుఁడును దనవానియొద్ద నుద్యోగంబును నియోగి మైత్రియు శాశ్వతం
బులు కావు. అన్న విక్రేత యింటి యాహారమునకుం బలె లంజెసానులయందభిరుచి రుచి
శూన్యము. ఎవ్వఁడే వస్తువు నెంత ప్రేమించునో వానికి దానివలన నంతపరితాపంబును గల
దు. రాజున కేనుగంటో చాకలివానికి గాడిదయునంతే. మూర్ఖునకుఁ గలిగిన యాగ్రహ
మపాయముచే నుకుండ మరలదు. మూర్ఖునకు శాంతోపదేశము దూదికగ్నివంటిది. మో
రకున కథ్యుపపత్తి గలుపుట యుద్దీపన దండమువంటిది. మండుచున్న క్రోధాగ్నికి శాం
తవచనంబు లింధనంబులు గాని జలంబులు కావు. అంధుఁ డంధులను గోఁతఁద్రోచినట్లు మూ
ఢసహవాసము మూర్ఖ్యముం బెంచును. స్వభావనిర్గుణంబగు వస్తువునందుఁ బక్షపాతమున
నెంతమంది గుణవర్ణన చేసినను గుణవత్త్వము రాదు. మేక మెడచన్నులనుండి పాలెవ్వఁ
డు పితుకఁగలఁడు.

## 29 షాడ్గుణ్య సముద్దేశము.

సమవ్యాయామములు యోగక్షేమములకుఁ గారణములు. కర్మప్రారంభముల
కుపాయాన్వేషణమే వ్యాయామమనంబడు. కర్మఫలప్రాప్తి విషయమయి యుపా
యాన్వేషణము క్షేమసాధనంబగు శమమనంబడు. దైవంబును మనుష్యప్రయత్నంబు
నుఁగలసి కార్యసిద్ధికి మూలంబులు. దైవమన ధర్మాధర్మములు. మానుషప్రయత్నము చిం
త్యము. దైవమచింత్యము. తలపకుండ సంప్రాప్తించిన యర్థానర్థములు దైవాయత్తము
లు. బుద్ధిపూర్వకముగ హితప్రాప్తియు నహితపరిహారంబును మానుషాయత్తంబులు. మ
నుష్యప్రయత్నలభ్యములయందును దైవాయత్తత లేకపోలేదు. దైవమున్నను మనుష్య
ప్రయత్నములేకున్న భద్రములేదు. దైవాయత్తమని యూరకున్నచో విల్లంబులతో
డుగువా! ప్రయత్నముఁ జేయు వాని కర్థానర్థప్రాప్తియందు సందేహముగాని దైవము
మీఁదనే భారముంచి ప్రయత్నముఁ జేయనివానికి మాత్రమనర్థమే తటస్థించును. ఔ
షధమున కాయుష్యమునకుంబోలె దైవపౌరుషములకు బరస్పరసంబంధము కలదు. ఆసం
బంధమే కార్యసిద్ధిసాధనము. యోగక్షేమముల నిష్పత్త్యుపాయమే నీతియనఁబడు. దు
ర్నీతి విపత్తునకు హేతువు, త్రిమూర్తి స్వరూపుఁడగు రాజుకంటెఁ బరమగు దైవ
ములేదు, బ్రహ్మచర్యాశ్రమమువలంబించి పరబ్రహ్మమునందు నిష్ణాతబుద్ధియై గురువు
లను నాశ్రయించి తెన్నగా విద్యలు సంగ్రహించి కౌమారము నాశ్రయించిన రాజపు
త్రుఁడు బ్రహ్మయగును. రాజ్యలక్ష్మీపట్టాభిషేకముఁ జెంది తనగుణములవలన ప్రజా

నురాగముఁ గలుగఁజేసికొను రాజు నారాయణమూర్తి యనఁబడు. "సాక్షాత్పృథ్వీప
తిః" యను వచనమిట నియందే వర్తించును. ప్రతాపమను తృతీయలోచనము నవలంబిం
చి పరమైశ్వర్యముతో రాష్ట్రకంటకులగు నసురులను శత్రువులను దానవులను జయింపఁ
దలఁచిన విజిగీషువగు రాజు పరమేశ్వరమూర్తి నాఁబడు. ఉదాసీనుఁడు మధ్యముఁ
డు విజిగీషువు, అమిత్రుఁడు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందుఁడు, ఆసారుఁడు, అంతర్ధి యను
వారు మండలాధిష్ఠాతలగు రాజులు. వీరికిఁగల లక్షణములు వేఱు. విజిగీషు మండలమునకు
ముందును వెనుకను బ్రక్కను గోణములయందును గల మండలమందుండియు నిగ్రహిం
చిన మధ్యమాదుల నిగ్రహించుటయందును గలసివచ్చినవారి ననుగ్రహించుటయందును
సమర్థుఁడై యుండియు గారణాంతరమున విజిగీషులై యితరుఁడు వచ్చినను నుదాసీన
భావముచే నుండువా డుదాసీనుఁడు నాఁబడు. ఉదాసీనుని వలె నేప్రక్క మండల
మునందుండియుఁ దాను విజిగీషువుకంటె నధికబల సమన్వితుఁడయ్యు నొకానొక కా
రణమున మాధ్యస్థ్యము వహించియుండువాఁడు మధ్యస్థుఁడు నాఁబడు. రాజ్యము పురుష
కారము దైవబలము. ద్రవ్యము చతురంగబలము. నీతిపరాక్రమములను గలవాఁడు, విజిగీ
షువనంబడు. విజిగీషువునకు హితమగు కార్యముఁ జేయుచు ప్రతికూలుఁడగు వాఁడే య
మిత్రుఁడు. మిత్రలక్షణమింతకుమున్నే వివరింపఁబడినది. విజిగీషువు దాడివెడలనున్న
ప్పుడుగాని వెడలినపిమ్మటఁగాని కోపమును బుట్టించువాఁడు పార్ష్ణిగ్రాహుఁడు. విజిగీ
షునకుఁ దనవారిశత్రు వాక్రందుఁడు. పార్ష్ణిగ్రాహాక్రందుల కమిత్రుండాసారుం
డు. అరివిజిగీషువుల మండలములకు మధ్యస్థంబగు మండలమునందుండి యుభయులచే
జీతముఁగొనువాడంతర్ధి యనఁబడుచుఁ బర్వతాటవ్యాదుల నాశ్రయించియుండు.
లుబ్ధుఁడును క్షుద్రుఁడును విరక్తులు నగు ప్రకృతులు గలవాఁడును ననుగుణ స్వభావము
కలవాఁడును నన్యాయశీలుండును వ్యసనమగ్నుండును బ్రతికూల మిత్రామాత్యమంత్రి
సేనాపతి సామంతాదులు కలవాఁడునునగు శత్రువుపై దాడివెడలనగు. అరి ఆశ్రయ
శూన్యుఁడై యున్నప్పుడును దుర్బలాశ్రయుఁడై యున్నప్పుడును నుచ్ఛేదనీయుఁడు
గర్షణీయుఁడును బీడనీయుఁడును నగు. సమాభిజనుండును సహజశత్రువిరుద్ధములగు ల
క్షణములు కలవాఁడును విరోధయితయు నగువాఁడు కృత్రిమశత్రువు. శత్రువునకుఁ
దనవారివాఁడు మిత్రుఁడే కాని యామిత్రత్వము శాశ్వతముకాదు. అవసరమే మి
త్రత్వామిత్రత్వములకుఁ గారణములుగాని యాంతర్యానంతర్యములు కావు. బుద్ధిబల
ము మంత్రశక్తి యనఁబడు. చెవులపిల్లి సింహమును జంపుటయే బుద్ధిబలమునకు దృష్టాం

తము. ప్రభుశక్తి యనఁగ కోశదండబలంబులు. దీనికి శూద్రకమహారాజును శక్తికుమా రుండును నిదర్శనములు. ఉత్సాహశక్తి యనఁగ బ్రారంభించినకార్యమునకై విక్రమబలంబున వెనుదీయకుండుట. దీనికి రాముఁడు దృష్టాంతము. అభివృద్ధిగాఁగు శక్తిత్రయసంపదకలవాఁడు గొప్పవాఁడు. బలవంతుఁడు, శక్తిత్రయహీనుఁడు హీనుఁడు. సమానశక్తిత్రయసంపద కలవారు సమానులు. సంధివిగ్రహయానాసనద్వైధీభావసంశ్రయములు షడ్గుణములు. అందుఁ బణబంధమే సంధి. అపకారము విగ్రహము. దాడివెడలుట యానము. ఉపేక్షయే యాసనము. శరణుఁజొచ్చుట సమాశ్రయము. ఒకనితో సంధి చేయుచు రెండవవానితో విగ్రహించుట గాని యొకనితోడనే సంధిసేయుచు విగ్రహించుట గాని ద్వైధీభావము. హీయమానమగు పణబంధము కలవానితో సంధిచేయవగు. వాఁడు పరిణతంబగు నర్థంబున మర్యాదోల్లంఘనము సేయఁడేని వానితో సంధి యుచితము. అతివృద్ధిమయంబునందాత్మక్షోభము లేదేని విగ్రహింపనగు. నన్నితఁడు జయింపలేఁడు నేనితనిని జయింపలేను నవస్థయందుత్తరకాలమునం గాకలమున్నచో నాసనముచితము. రాష్ట్రకంటకులు లేకున్నను బాహ్యాత్కోపము లేకున్నను గుణాతీతాయియే సర్వాతీతాయి. తనమండలమును రక్షింపకుండఁ బరమండలముపై దాడివెడలుట బట్టకట్టుకొనక తలపాగ పెట్టుటవంటిది. గ్రీష్మానికిఁ గాలిసంకెలవంటిది. శక్తిహీనుఁడు బలవానాశ్రయింపఁదగు. బలవంతునకు భయపడి దుర్బలు నాశ్రయించుట యేనుగువలని భయమున నాముదపు చెట్టెక్కుటవంటిది. అస్థిరం దస్థిరు నాశ్రయించుట నదిలోఁబడి కొట్టికొనిపోవువాని నింకొకఁడు కొట్టుకొనిపోవువా నాశ్రయించుటవంటిది. మానికి యవమానముకంటె మరణము మేలు. పరులు యిచ్చనచ్చినట్లు తిరుగుచు వాత్మవిక్రయము చేసికొనుట మేలుగాదు. ముందు మంచిదశ రాఁబోవునని యొ జెఁగినప్పుడేదియో యొకసంబంధమున నొరుని సమాశ్రయించుట యుక్తము. రాజకార్యములకుఁ గాలనియమము లేదు. రాజకార్యములు మేఘములవలె బయలుదేరుచుండును. ఉదాసీనాదులయెడలఁ గాని శత్రువులయెడలఁ గాని సంధివిగ్రహములకంటె ద్వైధీభావమే మంచిది. యిద్దరు బలవంతుల నడుమనున్న శత్రువు రెండుసింగములకు నడుమనున్న యేనుఁగువలె సుఖసాధ్యుఁడగును తనరాజ్యము సమర్పించుటకంటెఁ బన్నిచ్చయుండు నీ రాజ్యము తనయధీనము చేసికొనుట మంచిది. పన్నిచ్చుట యనిత్యము. బోయినచో రాజ్యము మరల రాదు. బుద్ధిపూర్వకముగా విత్తకుండినను భూమ్యాశ్రయము చేసిన విత్తనములచే చెట్టు పెరుగుచుండు. భూమిని బరిత్యజింపని రాజేల పెరుగఁడు ఉపాయమూలముగా విక్రయించుచుఁ బ్రకృతిమండలమును ననురాగముతోఁ బెంచు

గా జల్పదేశముకలవాఁడైనను కొంది కాలములో సార్వభౌముండగును. ఎవ్వనికి భూమి
కులపాలిక కాదు. వీరభోజ్యవసుంధర. సామదానభేదదండములని నాలుగుపాయములు.
గుణకీర్తనమనియు సంబంధోపస్థానమనియుఁ బరస్పరోపకార ప్రదర్శనమనియు నా
యతిప్రదానమనియు నాత్మోపసంధానమనియు సామము పంచవిధము. నాద్రవ్యమం
తయు నీది నేను నీవాఁడను నేను నీయిచ్చవచ్చినట్లు వర్తింతును అని తనయాత్మ
ను సమర్పించుట యాత్మోపసర్పణ మనిపించుకొను. చాలధనముఁ గాపాడుకొనుట
కై యల్పద్రవ్యము నొసఁగి సమాధానపఱచుకొనుట దానమనఁబడు. విషాదిప్రయో
గంబుల వలనను గుణాగ్రబుద్ధిగల గూఢచారులను శత్రుసైనికులఁగాఁ జేసియు శత్రుప
క్షమువారికి నన్యోన్యకలహజననంబగు క్రియఁ గావించుటయు భేదము. చంపుట బాధిం
చుటయు ద్రవ్యము హరించుటయు దండమనఁబడు. శత్రుసమీపమునుండి వచ్చినవా
నిం జక్కఁగాఁ బరీక్షింపవలయు. మంచిబుద్ధికలవాని ననుగ్రహింపవలయు. అరణ్య
మందుఁ బుట్టినను నౌషధము క్షేమకారియేగదా! గడ్డగూబవలె నల్పజంతువైనను శ
త్రుసంబంధియగు జంతువు గృహప్రవేశముఁ గావించె నేని దంత్రిమునను బాధచేయు
ను. మిత్రహిరణ్యభూమిలాభములలో నొకటికంటె నొకటి యెక్కువది. భూలాభ
మువలన హిరణ్యలాభంబును హిరణ్యమువలన మిత్రలాభంబును గలుగును. తానసమర్థుఁ
డైనయెడల హిరణ్యభూమిలాభములకంటె మిత్రలాభమె గొప్పది. ఒక్కొక్కతరి
భూమికంటెను మిత్రునికంటెను హిరణ్యమె గొప్పదగును. శత్రువునితో మైత్రి చే
యవలసినయెడ వాఁడు వచింపకుండునట్లుగాఁ జేయవలెను. సిద్ధార్థమునకు గూఢోపాయ
మున నవరణముఁ జేయఁజాలరేని సర్వశంకాదురపవాదము ఘటిల్లును. దుర్జనునకు
భయప్రదానముఁ గావించియు మాన్యులచే నుపదేశముఁ జేయించియు నుపశమింపఁజే
యవలెను. శత్రుసేవకులకు గూఢముగఁ దానము జీతములిచ్చుచు స్వాధీనపఱచుకొన
వలెను. శత్రువుల దాయాదులకు భూమియిచ్చి లోఁబఱచుకొనవలెను. ఒకనిభూమి యిం
కొక్కనికి వచ్చుటకు గొప్పప్రయత్నము కావలెను. సత్యమగు శపథము పరవిశ్వాస
జనకము. ప్రధానపురుషాది నిగ్రహమువలనను హేతువగును. అనర్థములు సూచ్యగ్ర
ములవంటివి. సూచీముఖమున పెద్దదారముఁగూడఁ బ్రవేశించును. క్షయమనఁగాఁ బు
ణ్యపురుషనాశమే. హిరణ్యధాన్యాదినాశము వ్యయము. స్వామిద్రోహము కాకుండు
నట్లుగాఁ దగిన లాభమపేక్షింపవచ్చును. రాబోవు నర్థమునకుఁ గాలహరణముఁ జేయ
రాదు. ఎన్నఁడు ద్రవ్యము దొరకునో యని సర్వశుభగ్రహనక్షత్రశుద్ధమగుకాలము
గడువలెనే గడువు నిర్ణయించినట్లు ద్రవ్యముచేకని ద్రవ్యమార్జింపవలెను. బుద్ధిబలు

మంబులు ఏవ్యాజమునఁ జాలవు. పెక్కుమందికలసి తనకపకారముఁ జేయఁదలఁచి
నను వారించలేకిని నొక్కసారి దండను విధింపరాదు అప్పుడప్పుడొక్కొకనికే శిక్షవి
ధింపవలయును. నూర్గురి నొక్కసారి చంపరాదు వేయిమంది నొక్కసారి దండింపరా
దు. ఏభూమియందు రాక్షసకృత్యములు జరుగవో యాభూమిరాజన్వతి. బ్రిభుష్షం
దోనుశోధన ముత్తరకాలావరోధకము కాదేని జేయఁదగు ఉత్తరకాలార్థసంబంధము
గల యాఁర్థ మనర్థమే కాదు. భూతభవిష్యద్వర్తమానకాల సంబంధమువలన లాభము
త్రివిధంబు నాఁబడు.

## 30వివాహసముద్దేశము.

పండ్రెండుసంవత్సరముల పెండ్లికూతురు పదియారువత్సరముల పెండ్లికొడుకును వి
వాహమునకు యోగ్యులు. ఇరువురును లోకవ్యవహారయోగ్యులు కావలయును. వివాహ
పూర్వకంబగు వ్యవహారము నాల్గుజాతులవారికిని సాంకర్యాభావమునఁ గులీనత్వమును
సంపాదించును. ముందు మాటలు జరుగుటయుఁ బిదప నగ్నిదేవద్విజసాక్షికముగా య
థావిధి పాణిగ్రహణమె వివాహమనంబడు. తల్లిదండ్రులు మొదలగువారు కన్యను య
థాశక్తి నలంకరించి దానపూర్వకముగా వరునకిచ్చిన వివాహము బ్రాహ్మమనంబడు.
"నీవు యావజ్జీవమీమహాభాగమునకు సహధర్మచారిణివి కమ్ము" అనినియోగించి కన్యా
ప్రదానము చేసిన పెండ్లి ప్రాజాపత్యమనంబడు. గోమిథునమును గట్నమిచ్చి చేసిన
పెండ్లి యార్షము. ఋత్విజునకు యాగదక్షిణగాఁ గన్యనిచ్చినవివాహము దైవము.
ఈనాలుగువివాహములును ధర్మ్యములు. తల్లిదండ్రులయు లేక బంధువులయు ప్రా
మాణ్యము కలిమిఁ బరస్పరానురాగపూర్వకముగా నన్యోన్యసమయపూర్వకముగా వధూ
వరులే చేసికొన్న పెండ్లి గాంధర్వము. జూదమునఁ బందెముగాఁ గన్యకనొడ్డిన పెం
డ్లి యాసురము, బలాత్కారకన్యాహరణము రాక్షసము. సుప్తమత్త కన్యాహరణము
పైశాచికము. ఈనాలుగువివాహములు నధర్మములుకాని యధర్మ్యములుకావు. న
గా భేదంబున వానికిని నంగీకారము కలదు. వధూవరుల కిరువురకును శుభలక్షణములు.
శుభప్రదములు కనీనికలయందు లోమములును సన్ననిపిక్కలును వంకరతొడలును, కటి
నాభి జఠరము కుచములు శిరము వీనియందు శుభలక్షణములు లేమియు భుజంబుల నలుపు
ను తాలుజిహ్వాధరంబులయందు పచ్చని రంగును యెచ్చుతగ్గుదంతములును గండముల
యందు గోఁతులును చెవుల కచ్చుతగ్గును. అతిలఘుమ్యూనాధిక వవధిక కుబ్జవామన కి
రాతాంగత్వంబును. నసమానజన్మదేహత్వము ననునివి కన్యాదోషంబులు. కన్యకంజూచు

కోఱుసవయేఁడు గాని దూత గాని వరబంధువులు గాని తాతొత్తుగ కన్యాగృహమునకుఁ బోవు నప్పటికి కన్య స్నానము చేయుచున్నచో రోగగ్రస్తురాలగును. ఏడ్చుచున్నచో మగనిం బాయును. నిదురఁబోవుచున్న నల్పాయుష్కురాలగును. విహరించుచున్న దుఃఖితయగు. ఇంటలేకున్న లంజయగు. కలహించుచున్నఁ బరిజనద్వేషిని యగు. అకృశవర్ణ నతి కనిష్టురాలగు. గావున నట్టికన్యను బెండ్లి యాడరాదు. పాణిగ్రహణ కాలంబునఁ బాణి శిథిలమయినచో వరునిఁ గన్య పరిభవించును. వరుఁడు తన మొగమువంకఁ జూడకున్నప్పుడు వికాసితలోచనయై వరునింజూచు కన్యక ప్రచండ యగును. ఏకశయ్యయందున్నతజే లాలింపని వరుని స్త్రీ పశువుగఁ దలఁచును. లాలింపకుండ బలాత్కారగ్రహణము గావించినచో స్త్రీ యాజన్మవిద్వేషిణి యగు. ధైర్యముఁ జాతుర్యము లేనివాఁడు కన్యకను బొందఁజాలఁడు. సమానమగు కులీనత సమమగు నైశ్వర్యము భిన్నమగు గోత్రము కల వధూవరులకే వివాహసంబంధము న్యాయము. కన్య తనతండ్రికంటె నధికైశ్వర్యవంతుండగు మగనిం గణింపదు. దరిద్రుని కన్యకను భాగ్యవంతుండగు వరుండును బరిగణింపఁడు. వారి కన్యోన్యానురాగము కుదురదు. దరిద్రునకు గొప్పవానితో సంబంధము వ్యయకారణ మవజ్ఞాకారణ మసంతుష్టికారణమును బరిణమించును. అవిశుద్ధకన్యాపరిగ్రహముకంటె వేశ్యను ముకొనుట మంచిది. అట్టికన్యక జన్మమే గర్హణీయమగును. ధనవంతుఁడు లోభియైనచోఁ బరిచారకు లేమి చేయుదురు. మోదుగచెట్టు పండియున్నను వాకిలిఁగొన్న చిలుకలేమి సేయఁగలవు. తెల్పఁగా వరింపఁబడినదయ్యుఁ బాణిగ్రహణము కాకున్నంతవఱకుఁ గులీనతాసంకరము కలిగినచో నాకన్యను వివాహమాడక విడువవచ్చును. అనులోమ్యముగా బ్రాహ్మణులకు నాల్గుజాతుల కన్యలును క్షత్రియునకు మూఁడుజాతుల కన్యలును కోమటికి రెండుజాతులవారును వివాహయోగ్యులు. మాతులకన్యావివాహము దేశకాలముల నపేక్షించియున్నది. అవిఘ్నమగు సంతానము. అనురాగము గృహవార్తలందుఁ జెప్పినట్లు వినుట. వంశమునకును జాతికిని దగినయాచారము దేవద్విజాతిథిసత్కారము సేయుట బాంధలగు కార్యములే దారసంగ్రహమునకు ఫలములు. కావుననే పెద్దలు "గృహిణీ గృహముచ్యతే" అన్నారు. గృహమన గృహిణియే కాని తలుపులు ద్వారబంధములు దూలములు మొదలగు కాష్ఠసంఘాతము గృహముకాదు. గృహకృత్యములు చక్కఁగా నెరవేర్చుకొనుట. అనంతవ్యయము కాకుండఁ బదార్థములు వాడుట గృహకృత్యములయందుఁ దప్ప దక్కినవ్యవహారములయందు స్వాతంత్ర్యము లేక యుండుట సదాచారము. తల్లివంటి స్త్రీలతోఁగూడ నంతఃపురమునందుండుట యనునవి స్త్రీరక్షణోపాయములు. వేశ్యలు

సర్వసామాన్యలు. వారితో నభిజాతుండు రమింపఁడు. ఇచ్చినకొలఁదిఁ బ్రేమఁజేయుట
సత్కరించినకొలఁదిఁ బరోపభోగ్యలగుట. శక్తిలేనిచోఁ బరిభవించుట లేక చంపుట.
ఎంతయుపకారముఁజేసినను వారిప్రియురాలుకాకుండుట. ఒకగడియ యేమఱియున్న
ను నాగడియలో బయునితో సంగమించుట మొదలగునవి వేశ్యాస్త్రీలకుఁ గల్పితములగు
ధర్మములు.

## 31 ప్రకీర్ణకసముద్దేశము.

ఇఁకఁ బ్రకీర్ణకసముద్దేశముం జెప్పుచున్నాను సముద్రమువలెఁ బ్రకీర్ణములగు
సూక్తిరత్నముల నింపుఁ జొప్పుటచే నిదితన్నామంబునం బరగుచుండె. వర్ణపద వా
క్య ప్రమాణ ప్రయోగ విజ్ఞాన గౌరవ మెఱింగిన సుమతియు సుముఖుండును సువ్యక్తగం
భీర మధురధ్వనియుఁ బ్రగల్భుండును ప్రతిభాశాలియు నూహాపోహశాలియు నవధా
రణాగమకుశలుండును సత్వరముగ వ్రాయుటయుఁ జదువుటయు నేర్చినవాఁడు
ను సంధివిగ్రహిక లక్షణములు కలవాడగును. కథావిచ్ఛేదంబును దొందరపాటును ము
ఖవైరస్యంబును సభాపేక్షణంబును స్థానత్యాగంబును జక్కఁగఁ జేయఁబడినదానియందు
గూడ దోషోద్ఘాటనంబును, మౌనంబును నపహాసంబును గాలయాపనంబును నాకాదర్శ
నంబును, నసత్యాలాపంబును విరక్తలక్షణంబులు. దూరావేక్షణంబును ముఖప్రసాదం
బును బ్రశ్నల యం దాదరంబును, ప్రియవస్తువులను స్మరించుటయు, పరోక్షమందు
గుణగ్రహణముఁ జేయుటయు, తత్పరివారమును శ్లాఘించుటయు దదనునయవృత్తి
యు ననురక్తలక్షణములు, చెవులకింపును బాగ్యవిరుద్ధము గాని యర్థాతిశయంబును, శు
భవాక్యరస సంపన్నతయు, నన్యూనాధిక వచనస్థితియు, ననన్వయ విరుద్ధత్వంబును
ననునివి కావ్యగుణములు. అతి పరుషవర్ణ విన్యాసంబును నపహిత యతియు ననన్వితా
ర్థంబును నవబోధపదోపన్యాసంబును నభిధేయాభిధానానతిశయానన్వయత్వంబులును నను
నివి కావ్యదోషంబులు, కవులష్టవిధములు కలవారు. మనఃప్రసాదమును గళాకౌశలం
బున సుఖముగఁ జతుర్వర్గముం దెలియుటయు సంసారంబునం గీర్తియుఁ గవిసంగ్రహ
మునకు ఫలంబులు. ఆలాపశుద్ధియు మాధుర్యంబును బ్రయోగవైశద్యంబును మార్దవం
బును నసముఖమునందును దనువుం బులకితముం జేయుటయు, రాగాంతర సాంకర్యాభా
వంబును గృహీతరాగనిర్వాహంబును మనోరంజకత్వము ననునివి సంగీతలక్షణములు, సమ
త్వము సవాలముతో గలియుటయు, గాయకభావము ననుసరించుటయు, మార్దవంబు
ను వ్యక్తయతి ప్రయోగంబును, శ్రుతిమధురత్వంబు ననునివి వాద్యగుణంబులు, చూ

ఘునందును నభినయమునందును నృత్యంబునందును, సమమగు సమాయోగంబును, సంగీత
ము ననుసరించుటయు, మృదువగు నభినయంబును రసోచితమగు హావభావములు గన్ప
ఱచుటయు నృత్యలక్షణములు. దుర్మార్గుల ప్రస్తావనయందును నెవ్వఁడు దుర్వచన
ముఁ బలుకఁడో వాఁడు మహాత్ముఁడు. ఎవని యింటికిఁ బోయి యతిధులు కృతార్థులు
గాకుండ మరలుదురో వాఁడు నిర్భాగ్యగృహస్థుండు. ఋణగ్రహణమున ధర్మంబును
సుఖంబును లేదు. ద్రవ్యము యాచకులకిచ్చినఁ దఱుగును గాని విన్యతిరుగదు. దాత
ఋణమిచ్చినచో వానికిఁ బరితాప మత్యంతమై యుండుటయు గలవాఁడును బరాభవం
బును నిచ్చినద్రవ్యము మరల రాకుండుటయుఁ దటస్థించును, దాతగానివాఁడు మరలఁ
దనయిచ్చిన ద్రవ్యము వచ్చువరకును స్నేహమును సౌజన్యంబును బ్రియభాషణంబును
పాటిత్వంబును విడువఁడు. ఏ అసత్యమువలనఁ బరోపకారంబును స్వాత్మలాభంబు
ను లేదో యది యసత్యము గాదు. శాస్త్రమున కష్టంబును ననర్థమువలని భీతిలేదు, ద్ర
వ్యము కొఱకుఁ దల్లినైనను జంపుటకు వెనుఁదీయదు. అసత్యమునకుఁ జంకఁడు, వివా
హముకంటె సకలానర్థ నిదానము మఱొకటిలేదు గాని వధూవర నిర్వాహము మాత్ర
ము దైవాయత్తము. రతికాలంబునఁ బలుకఁదగరానిమాటలులేవు, ఒకటియు జరుగన
దికాదు, గాని యంతమాత్రమున దాంపత్యుల ప్రీతి చెడదు. ప్రాతికూల్యము గాని
కలహము గాని రతికైతవము గాని యున్నచో దంపతులయనురాగము చెడును. ఎప్పటి
కప్పుడు సంపాదించుకొను సైన్యముగల రాజునకు జయమెక్కుడిది. వాని ప్రాణార్థస్త్రీ
లకుండుఁ గల్యాణమెక్కుడిది కృతార్థులగుదనుక వంశమును నందతీయుడల వినయ
ముఁ జూపుదురు. కూడజన్మించిన దేహమయినను జీవునితో వెంటరాదన్నచో నిఁక న
న్యులు వత్తురా! అశుభమునకుఁ గాలహరణమే ప్రతీకారము. పక్వాన్నంబువలనం బ
లె స్త్రీలవలనను దేహతాపోపశాంతియే ప్రయోజనము. అనురాగ విరాగములేల. గడ్డి
పోఁచతోనైనను బ్రయోజనమున్నప్పుడు దేహపాదధారియగు మానవునివలనఁ బ్రయో
జనముండదా! ఎవరువ్రాసిన కమ్మయైనను మఱువరాదు. రాజునకు సమయము వచ్చిన
ప్పుడవియే ప్రధానములు. సంధివిగ్రహాదివ్యాపారంబును సర్వజగద్వ్యాపారంబును ద
ర్పణముగ జేయున్నది. నీతి విదులు పుష్పయుద్ధమునైన నంగీకరింపరు. శరయుద్ధము
నంగీకరింతురా! పెద్దఱకను బోషించువాఁడే రాజు. అర్జునవృక్షము పండినచేమి! ఎం
డినచేమి. త్యాగి కల్పవృక్షమువలె సర్వసంబాధములు సహించును. రాజులు పర్వతము
లవలె దూరసౌందర్యము కలవారు. నవప్రక్కలకు దేశవార్తలన్నియుఁ దెలియఁద
గు సాధనములున్నదేశములే రమణీయములు. ధనమును బంధువులను లేనివానికి మను

ష్యసంచారముగల దేశంబును మహారణ్యమువంటిది. శ్రీమంతున కరణ్యంబును రాజధా
నియే. అసన్నవినాశుండగువానికి మతివిపర్యాసము కలుగును. పుణ్యవంతునకు కా
ర్యాభ్యుదయక్షయేలేదు. అనుకూలదైవమున్న విపదలను ద్రోఁచి సమస్తసంపదల నొసంగును.
అసహనుండును విహీనుండును కృతఘ్నుండును దీర్ఘకోపియుఁ గర్మచండాలురు. ఔ
రసుఁడు క్షేత్రజుఁడు దత్తుఁడు కృత్రిముఁడు గూఢోత్పన్నుఁడు అపవిద్ధుఁడు నను
నార్గురుపుత్రులును దాయాదులు పిండదానంబునకు యోగ్యులు. కానీనుఁడు సహోఢుఁ
డు క్రీతుఁడు పౌనర్భవుఁడు స్వయందత్తుఁడు శౌద్రుఁడు ననునార్గురును దాయాదులు
కారు. పిండదానంబునకుం దగరు. కొన్నిదేశములందుఁ గొన్నికులములందు దాయభా
గప్రాప్తి స్త్రీసంతానమునకు గలదు. యతికులమున శిష్యులకే కాని తనూజులకు లేదు. ఆ
త్యుపచయము కలవాఁడెవ్వని కవమానము సేయఁడు. భృత్యావరోధము రాజునే దండిం
చుటవంటిది. రతికాలంబునను మంత్రానుష్ఠానసమయంబును హోమము సేయుతఱిని భో
జనము సేయువేళను నెవ్వనిని నెవ్వఁడును సమీపింపరాదు. ఎంతపరిచయమున్నను బంధు
లయందైన విశ్వాసముంచరాదు. మత్తదంతినెక్కినఁ బ్రాణాపాయము వచ్చును. అతి
వినోదమంగభంగముఁ గావింపక తీరదు. అస్తిలేనివాని ఋణమును బరిచర్య చేయించు
కొని తీర్చుకొనవలెను. యతులయెడను బ్రాహ్మణులయెడను క్షత్రియులయెడను పూ
ర్వోక్తవిధి తగదు అశనము నెడలను శయనము నెడలను యథాలాభసంతుష్టి లేనివాని
కిఁ దనయాత్మయే వైరి. మహామునివలె సర్వాన్నములు తించు సర్వక్లేశము లనుభవించు
చు సర్వప్రదేశములందు శయనించువాని కసాధ్యమగునది లేదు. ఆడుదానియనురాగ
మువలె సంపద యెవ్వరికిని స్థిరముకాదు. అన్యులమీఁది తంత్రములు చెప్పువారు రా
జులకు ప్రియముగ నిష్టులగుచుందురు. నీచుఁడు పరనిందచే స్వోత్కర్షఁ గాఁ దలఁ
చును. అల్పత్వబృహత్త్వములు గుణములవలనం దెలియఁదగుఁ గాని పదార్థప్రమాణమువల
నఁ దెలియవు. కలుషమనీషులు నిర్నిమిత్తముగా మహాత్ములుగారు. ప్రకృతిచే శీతల
మగు జలము సైతముష్ణమగుట వహ్నిప్రభావము. చిరకాలస్థాయియైనను గార్యార్థి లె
స్సఁగా నారాధింపవలెను. కాని యార్థికవ్యవహారముం జేయరాదు. శుభాశుభకర్మ
ములు రెంటను సత్పురుష పురస్సరముగాఁ జేయువానికి నాపదలును నపవాదలును రా
వు. సంపదలలో సంపదలును విపదలలో విపత్తులును వచ్చుచుండును. దుష్టాధికారియుఁ
గార్యాధికారియుఁ బరసంబాధమును విచారింపడు. శాస్త్రవేత్తలును స్త్రీలును ననుభూతగు
ణులై పరమాత్మను రంజింపఁజేయుదురుగాని ప్రసిద్ధిలో వారికిఁబని లేదు. చిత్రగతుం
డగు రాజుంగూడ దిరస్కరింపరాదు. క్షత్రియతేజము గొప్ప భగవదేవత. యనఁద

# శ్రీసరస్వతీ కార్యస్థానమున వెలకుదొరుకుపుస్తకములు.

| | రు. | అ. | ప. | | రు. | అ. | ప. |
|---|---|---|---|---|---|---|---|
| మార్కండేయపురాణము | 1 | 4 | 0 | సువర్ణశృంఖల | 0 | 8 | 0 |
| కళాపూర్ణోదయము | 1 | 0 | 0 | కాంచనమాల | 0 | 8 | 0 |
| బాలరామాయణము | 1 | 0 | 0 | విక్రమాంకదేవచరిత్రము | 0 | 8 | 0 |
| రాజతరంగిణి 1-2 భాగములు | 1 | 0 | 0 | చంద్రప్రభచరిత్రము | 0 | 8 | 0 |
| కేయూరబాహుచరిత్రము | 0 | 6 | 0 | [illegible]నాటక కథాసారము | 0 | 12 | 0 |
| శుకసప్తతి | 0 | 14 | 0 | ఫసానే అజాయబ్ | 0 | 8 | 0 |
| హరవిలాసము | 0 | 8 | 0 | శ్రీశివాజీచరిత్రము | 0 | 10 | 0 |
| శకుంతలాపరిణయము | 0 | 8 | 0 | నన్నయభట్టారక చరిత్రము | 0 | 8 | 0 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 6 | 0 | [illegible] చరిత్రము | 0 | 4 | 0 |
| విజయవిలాసము | 0 | 6 | 0 | అమీరే హంజా | 0 | 8 | 0 |
| అపవాదతరంగిణి | 0 | 6 | 0 | భువనమోహిని | 0 | 4 | 0 |
| బహులాశ్వచరిత్రము | 0 | 6 | 0 | హరిశ్చంద్రమహారాజుకథ | 0 | 4 | 0 |
| కువలయాశ్వచరిత్రము | 0 | 8 | 0 | సాహసిక క[illegible]నము | 0 | 6 | 0 |
| శృంగారశాకుంతలము | 0 | 8 | 0 | [illegible]నంద సాగరము | 0 | 6 | 0 |
| పార్వతీపరిణయము | 0 | 8 | 0 | [illegible] చరిత్రము | 0 | 6 | 0 |
| కకుత్స్థవిజయము | 0 | 8 | 0 | కార్లో నేపస్ సంచిక | 0 | 6 | 0 |
| త్రిలోకసుందరి | 0 | 8 | 0 | సుయోధనాభిమానము | 0 | 8 | 0 |
| ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము | 0 | 6 | 0 | గుణమంజరి | 0 | 6 | 0 |
| చంద్రహాస నాటకము | 0 | 12 | 0 | వీరబలవినోదములు | 0 | 6 | 0 |
| కన్యకాపరమేశ్వరినాటకము | 0 | 6 | 0 | శుక్రనీతిసారము | 0 | 10 | 0 |
| మృచ్ఛకటికము | 0 | 12 | 0 | కళావిలాసము | 0 | [illegible] | [illegible] |
| ముద్రారాక్షసనాటకము | 0 | 8 | 0 | శ్రీనాథచరిత్రము | 0 | 4 | 0 |
| మాలతీమాధవము | 0 | 8 | 0 | కన్యాశుల్కము. | 0 | 12 | 0 |
| మల్లికామారుతప్రకరణము | 0 | 14 | 0 | వివేకానందోపన్యాసములు. | 0 | 10 | 0 |

ఇంకా యితరగ్రంథములు చాలగలవు.

కేట్లాగుకు వ్రాసినయెడల నుచితముగా పంపుదుము.

కావలసినవారు

సరస్వతీ మేనేజరు, కాకినాడ, అని వ్రాయవలెను.